# A Criticism of

# VALMIKI RAMAYANA

1. "The Indian Pandits are not strong in ethnology and history and habitually careless with respect to the names of peoples and countries which they frequently alter or substitute in their works one for the other."

Buhler - S. B. E. series Vol. 25.

2. "India had unfortunately no written history."

R. G. Bhandarkar.

3. "As is well known, the science of history finds no place in orthodox Sanskrit learning and it was not until western scholars drew attention to these matters that any steps were taken in this direction."

H. G. Rawilson.

Charitraka Siromani

Kodali Lakshminarayana B.A.,

# తొలి పలుకులు.

1944 వ సంవత్సరములో 'ఆంధ్రప్రభ'లో ప్రచురించు నిమిత్తము, నేను వ్రాసిన 'రామాయణ విమర్శనము' లోనికొన్ని వ్యాసములు మాత్రము ఆంధ్రప్రభ సంపాదకునికి బంపినాను. వీనిని సమగ్రముగా శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారు పరిశీలించి, ఇందలి చారిత్రిక సత్యముల గ్రహించి, తమ పత్రికలో ప్రచురించుకొనినారు. అందరు లేఖకులకు దమ పత్రికలో సరిసమానావకాశములు గల్గించవలెనని వీరి సంకల్పము. ఈ విధముగా వీరు, ఆంధ్రదేశముతో నాకు పరిచయ భాగ్యమును గల్గించినారు. ఈ సత్యాన్వేషికి చిరాయురారోగ్య భాగ్యములు కల్గుగాక !

ఆంధ్రదేశములో బలువురు విమర్శకులు, పండితులు, చరిత్రకారులు, ఈ విమర్శనా శక్తిని, నూత్నమార్గములో నడచిన, ఈ పరిశోధనల నర్థము చేసికొని, త్వరలో బుస్తకము నచ్చువేయవలసినదని కోరుచు, పెక్కు జాబులు వ్రాసినారు. వీరిలో 'ఆలపాటి, ఆవుల, ఇంకొల్లు, రావిపూడి ముఖ్యులు. వీరి కోర్కెపైననే, చరిత్రనుగూర్చి గోవాడ, పెపర్లంక, చల్లపల్లి, నాగండ్లలో నేనుపన్యసించుట జరిగినది వీరికి నాయాశీస్సులు. అనేక కారణములచేత నేని పుస్తకము నింతకాలమునుండి వెలుగులోనికి తీసికొని రాజాలక పోయినందులకు విచారించు చున్నాను.

ఆంధ్ర విశ్వ విద్యాలయాధికార్లు, మా నాగార్జున చరిత్రను 1950–1951 సం. భాషాప్రవీణ ఫైనల్ పరీక్షకు పాఠ్యగ్రంథముగా నిర్ణయించిరి. గ్రంథముయొక్క యోగ్యతను గుర్తించి నందులకు సంతసమే. అనేక సంవత్సరములు శ్రమపడి వ్రాసిన ఈ గ్రంథమును 'ఇంటర్ మీడియట్'కో పట్టపరీక్షకో పఠనీయ గ్రంథముగా బెట్టి, కళాశాలా విద్యార్థులకు జక్కని విమర్శనా శక్తిని గల్గునట్లు మూఢ నమ్మకములుపోయి విశాల భావములు గల్గిన, భావిపౌరులుగా, సత్యాన్వేషకులుగా, నూత్న దృక్పథము గలవారినిగా విశ్వ విద్యాలయాధికార్లు తయారు చేసెదరని నమ్ముచున్నాను. ఆనాడు నాజీవితము సార్థకమైనదని ఆనందించెదను. దేశమునకు బునర్జన్మ కావలసిన రోజులలో మతగ్రంథములు, ధూమశకట వాజ్మయమును విద్యార్థులకు పాఠ్యగ్రంథములుగా నిర్ణయించిన, ఆర్థిక, సాంఘిక రాజకీయ, సాహిత్య రంగములు చైతన్య రహితములై, కళావిహీనములై నిరుపయోగములగును. అత్యధికమైన జాతీయతను బోధించు గ్రంథములు కూడ నిట్టే నూత్న భావముల కల్గింప జాలవు. పైగా లౌకిక ప్రజాస్వామిక

మును వ్యర్థము చేయును. జాతీయత అర్ధమత నమ్మకము (Nationalism is semi religious faith) అను 'వివేకానందు'ని సూక్తిని మరువకుండుట గాత. జాతీయత పేరున కూడు గుడ్డ గృహముల విషయములో నెట్టి చర్యయైనను గైకొనవచ్చును. కాని అన్నిటిలో నిది పనికిరాదు. మన దేశభక్తి 'ఖలునికి ఆఖరు శరణ్యము' (Patriotism is the last refuge of a scoundrel) అను 'జాన్సను' వచనము క్రిందకు దిగరాదు. ఈ విషయములన్ని మనసులోనుంచుకొని పాఠ్యగ్రంథ నిర్ణయము చేసినచో' విశాలభావములు గల విద్యార్థులు తయారగుదురని నా నమ్మకము; వీరేశలింగము, లక్ష్మణరావు, వీరభద్రరావు మున్నగు పెద్దలిట్టి ఉన్నత భావములుగల వారే. అందుచే నాకు వారు పూజ్యులు.

పాఠ్యగ్రంథములు నిర్ణయించువారు, రేడియో కార్యక్రమములు వేయువారు, సంకుచిత జాతి, మత, కుల తత్వముల కతీతులై, ఉన్నత భావములుగలవారై, ఆశ్రితపక్షపాతము లేకుండ, అందరకు అవకాశములు గల్గించుటయే కాక, నూత్న భారతభూమిని సృష్టించువారై యుండవలెను. "దేశము అల్పభావములు గల పెద్దవారితో గాక, ఉన్నతభావములు గల చిన్నవారితో బలపడును." అను రామతీర్థుని వచనమును, ప్రతివారు గుర్తించుకోవలెను. తాత్కాలిక లాభముల నాశించి, ఐక్యతను భిన్నపరచినచో, ప్రజాస్వామికము విఫలమైపోవును. ఒకనాడు భారతదేశములోగల ప్రజాస్వామిక విధానమిట్లే, విచ్ఛిత్తిచెందినది. ప్రతివాడు నాయకుడేయైనచో, ననుచరు లెందుండి వత్తురు? 1857 లో సిపాయి కలహము జరిగినప్పుడు, 'సర్ జాన్ లారెన్సు' పల్కిన పల్కులందరు మననము చేయదగినవి. "లక్ష ఏబది వేల పితూరిదార్ల దండులో ఒక్కడు కూడ నాయకుడు లేడు. వారి కర్థనాయకు డున్నను, మేము భారత వర్షమును దప్పక కోల్పోయి యుండెడి వారము"

ఇక గ్రంథ సమీక్ష విషయములో నొక్కమాట; పత్రికాధిపతులు గ్రంథ సమీక్ష చేయునపుడు, ద్వేషబుద్ధిని మాని, సమీక్ష ఒక కళయని గుర్తించి విమర్శించ వలెను. ప్రజాస్వామికము, రాజ్యాంగమే కాకుండా ప్రజలయొక్క క్రమానుగతమైన జీవిత సరళియని (Progressive way of life) గమనించ వలెను. దీనికి సమత్వము ముఖ్యము. 'రామకృష్ణ పరమహంస' రాత్రివేళలందు, ఒక హరిజనుని యింటికేగి తనలోని అహం

భావము నశించుటకు తన శిరోజములతో నాగృహమును చేతతో నలుకు చుండువాడు. ఇట్టి సమత్వ మున్నచో ప్రజాస్వామికము సఫలమగునని నా నమ్మకము. పత్రికాధిపతు లన్నిగ్రంథములను సమదృష్టితో విమర్శింప వలెను కాని, వక్రమార్గముల జనుట పాడికాదు. ప్రచారమునకు ముఖ్యులైన పత్రికాధిపతులు, తమధర్మమును సమదృష్టితో నిర్వర్తించెదరని నమ్ము చున్నాను.

తెలుగు దేశములో నూతన గ్రంథముల కొనిచదువువారు తక్కువ; అందులో మా గ్రంథములన్ని పరిశోధక గ్రంథములు; మామూలు చదువరి అంతగా చారిత్రక విషయముల గ్రహించలేడు. అందుచేత మాకు గ్రంథముద్రణలో నష్టమే వాటిల్లుచున్నది; అయినను వ్యయప్రయాసలకోర్చి, జీవితములు పవనచలిత దీపశిఖలవలె క్షణభంగురములని తలంచి, మేము పరిశోధించిన విషయముల నెప్పటికప్పుడు, వ్యాస, గ్రంథరూపములలో ప్రచురించు చున్నాము. మాకష్టముల గుర్తెరిగిన పెద్దలు, మమ్ము పిలువంబంచి, సన్మా నించి, మాకృషిని శ్లాఘించి పంపుచున్నారు. ఈ గ్రంథముద్రణకు, ఉలవ పాటి వాస్తవ్యులు, విమర్శకులు, పండితులునైన శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణా రెడ్డిగారు రు 50 ల నొసంగిరి. పెదపూడి వాస్తవ్యులు భూస్వామి ఉదార స్వభావులు అయిన శ్రీ దేవభక్తుని కాళిదాసుగారు, వారిప్రియ తనయుడు, శ్రీ లోకేశ్వరరావు గారును నన్ను భక్తిశ్రద్ధలతో బిలిపించి, రు 50 ల నొసంగి, తమ సాహిత్యాభి మానమును గన్పరచిరి. అభినవ సహదేవులు శ్రీ యేజండ్ల శ్రీరాములుగారు, 2—6—49 న తెనాలిలో కవిసన్మాన సభ నేర్పాటు చేసిరి. మాచారిత్రక కృషికి సంతసించి, శ్రీగోగినేని వెంకట సుబ్బయ్య నాయుడుగారు, మాకు కూడ మిగత వారితోబాటు రు. 116 ల నొసంగిరి. ఆ ద్రవ్యమును గూడ ఈ గ్రంథ ముద్రణలో నుపయోగించితిని; ఈ విధముగా సాయపడిన దాతలెల్లరకు, నన్ను నిచ్చలు ఆశీర్వదించు బ్రహ్మానందబాలయోగి గారికి గ్రంథ విక్రయములో సహాయ భూతులగు చున్న మిత్రులకు మా వందనములు.

ఈ గ్రంథములోని ప్రూఫులు శ్రద్ధతో నేను కవిరావుగారు కలసి దిద్దినను, కొన్ని తప్పులు పడినవి. అందులకు క్షమింప వేడెదను.

మోపఱ్ఱు
24—12—49

లక్ష్మినారాయణ.

# ON THE ART OF REVIEWING

"I recommend the synthetic view of literary criticism. The reviewer will have to cut down his prejudices to arrive at a balanced view, charged with sovereign sanity and brilliance, to help the reader to an appreciation of a literary work."

"The reviewer is like Gautama Buddha's disciple, Pourna who was admonished by the master thus. "Go then, O Pourna, having been consoled, console: being arrived thyself at the farther bank, enable others to arrive there also."

Prof. B. S. MATHUR

"The two notes of the critic are sympathy and knowledge. Sympathy and knowledge must go hand in hand through the fields of criticism. As neither sympathy nor knowledge can be complete, the perfect criticism is an impossibility. It is hard for a reviewer to help being ignorant, but he need never be a hypocrite. Knowledge certainly seems to be the very essence of good criticism, and yet judging is more than knowing. Taste, delicacy discrimination—unless the critic has some of these, he is naught. Even knowledge and sympathy must own a master. The master is sanity. Let sanity for ever sit enthroned in the critic's armchair.

Rt. Hon'ble AUGUSTIN BIRREL



కీ॥ శే॥ కొడాలి భారతీ కుమారి

నాకు సహాయభూతురాలైన నా రెండవకుమార్తె 5-వ ఫారము చదువుచు 'నెఫ్రైటీసు' అను వ్యాధిచే విజయవాడ కృష్ణలంకలో మరణించినది.

జననము:— తేది 30—1— 1934 మంగళవారం ఉదయం గం॥ 8-56 ని॥లకు.

మరణము:— తేది 12-12-1948 ఆదివారం ఉదయము గం॥ 7-30 ని॥లకు.

| | | | |
|---|---|---|---|
| | | | |
| ల<br>కు | జననము<br>రాశిచక్రము | | కే<br>చం |
| ర బు<br>శు శ<br>రా | | | |
| | | | గు |



AUTHOR

"As long as mountain ranges stand
And rivers flow upon the earth
So long will this criticism (Ramayana)
Survive upon the lips of man"

# ౧. రామాయణశైలి

'రామాయణము' సంస్కృత భాషలో మొదటి కావ్యము; ఇతిహాసమని, వీరకావ్యమని కూడ ప్రసిద్ధి. 'వాల్మీకి' ఆదికవి: అనగా మొదటి కావ్యకవి. అంతకు బూర్వము 'ఋగ్వేదకాలము'లో గవులు కాన్పించుచున్నారు. 'నాభనెదిష్ట,' 'పురూరవాసు' 'ఉపానసుశుక్ర' మున్నగువారు కవులే. కాని కావ్యకవులు కాన్పింపరు. 'ఉపానసు 'శుక్రుని' శుక్రుడని పిల్తురు. ఈయన దైత్య గురువుగా గాన్పించుచున్నాడు.

అరవిందుని వంటి యోగి సంస్కృత విద్వాంసుడు పృథివిలోఁగల సమస్త కావ్యములలో రామాయణ ముత్తమమైనదని వ్రాసెను. 'జాకోబి' యను శార్మణ్య విద్వాంసుఁడు కూడ రామాయణకర్త రచనా కళను బ్రశంసించెను. [1] 'బ్రాహ్మణులు మాటాడే పరిశుద్ధ భాషకు, మామూలు మనుజులు మాటాడే సంస్కృత భాషకుగల తారతమ్యము, రామాయణమున వ్యక్తమగుచున్నదని, 'జాకోబి' వ్రాసెను. [2] 'వాల్మీకి' వాడిన ఛందముల, వివిధ ప్రదేశములలో నుపయోగించిన నానావిధాలంకారముల నుపయోగించు నేర్పు, చూచినచో ముందు రానున్న 'కాళిదాసు' శైలిలోని మెరుగు, నాజూకులఁ జూపుచున్నట్లుండును;" అని 'కీత్' పండితుఁడు శ్లాఘించెను. [3] అదియునుగాక కవికుల తిలకుండు 'కాళిదాసు' రామాయణము ననుసరించిన జాడలు కాన్పించును. సీత కొరకు రాముని విలాపము, యక్షుడు తనభార్య కొరకు కాంక్షించిన విధమును, బోలి యున్నదని, రామాయణములోని చతుర్థకాండములోని, 28 వ సర్గలోని వర్షఋతు వర్ణనను బట్టి, మేఘదూత కర్త, యిందలి కొన్ని అంశములఁ గైకొని, వ్రాసియుండెనని, 'కీత్ పండితుడు' వ్రాసెను. [4] కాళిదాసు రామాయణము ననుకరించెనని, సి. వి. వైద్యా కూడ వ్రాసెను. ఇది సత్యమే కావచ్చును.

---

1. A. B. Keith - Classical Sanskrit Literature (1936) P. 12.
2. Ibid – (H. Jacobi — Das Ramayana P 115.)
3. Ibid –
4. Ibid – P 32.

'సర్ మానియర్ విలియమ్సు, వీబర్, మాక్డనాల్' మున్నగు విద్వాంసులు, భారతీయ విద్వాంసులు, రామాయణ శైలిని వేనోళ్ళ శ్లాఘించిరి. భారతవర్షములో నేటివరకు, సంస్కృత సాహిత్యములో 'రామాయణము' పొందిన పేరు, ఏ గ్రంథమును బొందియుండలేదని, 'మాక్డనాలు' శ్లాఘించుచు, వర్ణనలలోని శైలి, అలంకారము నుపయోగించు నేర్పును గాంచి, ఆశ్చర్య చకితుఁడాయెను.[5] ఈ యలంకారములఁ జదివి ఆనందింపని వాఁడుండడు. ఉపమ, రూపక, ఉత్ప్రేక్ష, అర్థాంతరన్యాస, మున్నగుగాఁగల సరళ, స్వభావ, సుందరమగు అలంకారములతో, నైసర్గిక వర్ణనలతో కథా సౌష్ఠవము, చమత్కారవంతముగా నున్నది.

రామాయణమునకు సమమగు లోక ప్రియరచన, భారత వర్షములో నింతవరకు నెచటను గాన్పింపదు; ఇందలి భాష సరళమైనది. కథాసందర్భము మనోహరమైనది. కవిత ధారావాహినివలె ప్రవహించినది. 'జాతే జగతి వాల్మీకౌకవి రిత్యభిధా భవత్' ప్రపంచములో 'వాల్మీకి' పుట్టిన తర్వాతనే 'కవి' శబ్దము ఆవిర్భూతమాయెనని, కవిని జేయలేదు, పుట్టుచున్నాడని, వాల్మీకి విషయములో నిది తేటతెల్లమగుచున్నదని, 'పండిత వేద వ్యాసుఁడు' తన 'సంస్కృత సాహిత్య చరిత్రము'లో నుల్లేఖించెను; కాని కవులు తత్పూర్వ మున్నను, కావ్య కవులు కాన్పింపరు.

'వాల్మీకి' అలౌకిక ప్రతిభాసంపన్నుఁడు; కవితాకామినిని, వాగ్దేవిని వశముఁ జేసికొన్న కవి. ఈయన కవిత చిత్తాకర్షణీయమైనది. వ్యాసునికంటె కూడ కవిత, అధిక పరిష్కృతమైనదని ఉత్తమమైనదని కొందరు పండితుల అభిప్రాయము. 'మహాభారతము' లోని యుద్ధ పర్వశైలిని బోలియున్నదని 'వీబరు' పండితుఁడు వ్రాసెను. ఈ విషయము పండితులకే వదలి వేసెదను. ఈ కవి నేర్పుతో 'రూపకాలంకారములు' వాడినట్లు ఏ కవి వాడియుండడు. ఈయనతోనే కావ్యోదయమైనదని చెప్పవచ్చును. ఇందలి భాష ఆడంబర రహితమైనది.

---

5. A. A. Macdonall- A history of Sanskrit literature P 317.
Also Imperial Gazetteer of India — Vol II. P 238.
Also A. A. Macdonall—Indians Past (1927)—P 91.

అనేకమంది కవులకు, నాటక కర్తలకిది మూలము. రామాయణము ననుసరించి అనేక గ్రంథములుత్పన్న మైనవి: అనేక భాషలలోనికిది అనువదిత మైనది. భాస, కాళిదాస, భవభూతి, మురారి, భట్టి, రాజశేఖర, క్షేమేంద్రుడు, మున్నగాఁగల సంస్కృత కవుల ప్రతిభాశక్తి, వాల్మీకి వలననే కలిగినది. మహాభారతము, పురాణములకు మాతృక యైనట్లు క్రీ. శ. 400 నుండి క్రీ. శ. 1100 వరకు వ్రాయఁబడిన గ్రంథము లనేకములు, రామాయణము ననుసరించి వ్రాయబడినవి. 'అక్బరు' కాలమున నున్న 'తులసీదాసు' (క్రీ. శ. 1532 – 1623) రచించిన 'రామచరిత మానసము' 'వాల్మీకి' కోకిల రచనను జూచియే రచించినాడు. ఇది పది కోట్లమంది ఉత్తర భారతీయులకు, 'బైబిలు' వంటిది. వాల్మీకి కవితా ప్రభావ మేదో రూపమున, సంస్కృత కవులలో ప్రతివానిపైన ప్రసరించి యున్నది. జైన, బౌద్ధకవులనేకులు, రామాయణము ననుకరించిరి. ఈ 'రామ కథ' ఆసేతు హిమాచలము వ్యాపించినది. భారతీయులు వలసకేగినపుడు, 'రామాయణము' జావాద్వీపములో, తూర్పుదీవులలో, ఇండోచైనాలో గూడ వ్యాపించిన ఆధారములు కలవు. ఈ కథ ప్రతిమాశిల్పమున గూడ ప్రదర్శింపఁబడినది. 'హంపీ విజయనగరము' లోని 'హజారా రామస్వామి దేవాలయము' మీద రామ కథయంతయు జిత్రింపఁబడియున్నది. 1940 వ సంవత్సరము జులై 9 వ తేదీన, మేము 'హంపీ విజయనగర విహారయాత్ర' కేగినపుడు, మేమీ శిల్పమును గన్నారగాంచి, యానందించినాము.

రామాయణములోని శ్లోకములు 'అనుష్టుభ్' శ్లోకములు. ఈ శ్లోకముల ఉత్పత్తి విషయము, చారిత్రక సత్యముగాఁ గాన్పించు చున్నది. 'వాల్మీకి' గంగ యొడ్డున, తన ఆశ్రమములోనుండి, 'రామకథ'ను వర్ణింపదలంచుచుండెను. ఇంతలో రెండు క్రౌంచ పక్షులు నదియొడ్డున నుండగా, బోయవాఁడొకఁడు బాణముతోఁ గొట్టెను. ఆ విహంగము రక్తసిక్తమై, నేలఁగూలెను. ఈ కరుణామయదృశ్యము, హృదయవిదారక మైనది. 'వాల్మీకి' హృదయము కరగిపోయెను. ఆడపక్షి విలపించుచుండెను. వాల్మీకి స్వాభావిక ధోరణిలో గతిన పాషాణహృదయుండగు వ్యాధుని శపించుచుండెను. ఈ విలాపమే యతని కవిత్వధోరణి కారంభము. కవి పాడిన మొదటి శ్లోకమిది.

శ్లో॥ మానిషాద ప్రతిష్ఠాంత్వ మగమశ్శాశ్వతీస్సమాః
యత్క్రౌంచ మిథునాదేక మవధీః కామమోహితమ్.
(బాలకాండ 2–15)

తా. ఓ కిరాతుడా! క్రీడించుచున్న క్రౌంచపక్షుల సమీపమునకుఁ బోయి రతిక్రీడచే పరవశమైయున్న మగపక్షిని జంపినందున, నీవు బహు కాలము జీవించియుండుట తగదు.

ఈ శ్లోకము చెప్పి, శిష్యుఁడగు భారద్వాజునితో గూడ 'వాల్మీకి,' తన ఆశ్రమమున కేతెంచెను. వాల్మీకి నాల్గుపాదములుగల, ప్రతిపాదములో సమాన సంఖ్యగల అక్షరములుగల, వీణాతంత్రిధ్వని, లయగలిగియున్న శ్లోకమును గూర్చి యోచించుచుండ, బ్రహ్మవచ్చెను. అప్రయత్నముగా, ఛందోబద్ధమైన శ్లోకరచనను వాల్మీకి చేసినందుల కానందించి, రామకథ నీ శ్లోకములలో వ్రాయుమని బ్రహ్మ చెప్పెను. బ్రహ్మ యిట్లనెను.

శ్లో॥ యావత్ స్థాస్యంతి గిరయస్సరితశ్చ మహీతలే
తావద్రామాయణ కథాలోకేషు ప్రచరిష్యతి॥
(బాలకాండ 2-36 ½)

తా॥ పర్వతములు, నదులు భూమిలో నెంత కాలముండునో, అంత కాలము రామాయణము లోకములో వ్యాప్తి చెందును.

ఈ విధముగా 'వాల్మీకి' శ్లోకారంభకుఁడయ్యెను. 'వాల్మీకి' యే,లౌకిక సంస్కృతమునకు శ్లోకము లారంభించెను. ఇందలి 'బ్రహ్మ' ఒక ఋషి కావచ్చును.

ఇందలి వ్యాకరణము, భాష వేద భాషకు భిన్నమై, లౌకిక సంస్కృతమునకు దగ్గరగా నున్నదని, 'స్మిత్' వ్రాసెను. ఈ విషయము సత్యముగానే యున్నది. ఈ గ్రంథమును నేటికి అనేక మంది గాయకులు, వివిధ రకములఁ బాడుచుందురు. పండితులిందలి యలంకారముల నేర్పునుగాంచి ముగ్ధులగుచుందురు. పామర జనులు విని ఆనంద సముద్రమున మునుగుచుందురు. ఆసేను హిమాచలము. రామాయణము పవిత్రమైనదని, వాస్తవమైన ఇతీహాసమని తలంచి జనులు పూజించు చున్నారు. కాని రామకథ చారిత్ర

6. V- A. Smith Oxford History of India. P 27.

కముగా జరిగినదాయను విషయము మమ్ము బాధించు చున్నది. మూల రామాయణ మెద్ది? ప్రక్షిప్త భాగములెవ్వి? ఏయే కాలములలో నవి ఎట్లు చేరినవి? రామకథ ఎంత వరకు సత్యము? ఈ విషయములను, పౌరాణిక దృష్టితోగాక, శాస్త్రీయమైన చారిత్రక దృష్టితోఁ బరిశీలింప వలెను.

---

# ౨. మూలరామాయణము_ప్రక్షిప్తరామాయణము

వర్తమాన రామాయణ మంతయు 'వాల్మీకి' రచితమేనా ? ఈ సందియము పలువురు విద్వాంసులను బాధించుచున్నది. పాశ్చాత్య, పౌరస్త్య విద్వాంసులు పలువురు, రామాయణ మంతయు శైలినిబట్టి, భాషాభేదమును బట్టి, 'వాల్మీకి' రచితము కాదని, యభిప్రాయ మొసంగిరి. దీనికిఁ దగు ప్రమాణములను గూడ పరిశీలింపవలయును.

లిపి, లేఖన సామగ్రి లేని కాలములో, గ్రంథములన్నియు వాగ్రూపములో వచ్చుచుండెను. బాలకాండము నాల్గవ సర్గనుబట్టి, గాయకులు, సంగీత పాఠకులు రామాయణమును బాటగాఁ బాడుచుండిరని, వర్ణించుచుండిరని తెలియుచున్నది; కాని కాలక్రమమున, గాయకులు, విద్వాంసులు, పాడునపుడనేక శ్లోకములు, స్వేచ్ఛగా ప్రక్షిప్త భాగములు గలుపసాగిరి. ఈ ప్రకారము ముద్రణాయంత్రములు, అచ్చు పుస్తకములు వచ్చు వరకు జరుగుచునే యుండెను. మూలపురాణములో 4000 శ్లోకము లుండెను. పంద్రెండు వేల గ్రంథమని భవిష్యత్పురాణములోని యొక శ్లోకము తెల్పుచున్నది; కాని ఈనాటి పురాణములలోని శ్లోకములు నాల్గులక్షలకు పైగా యున్నవి. అట్లనే 'జయ' మొదట 8800 శ్లోకములు గల్గియున్నది; కాని ఈనాటి మహాభారతములో హరివంశముతో గూడ లక్ష యిరువది వేల శ్లోకము లున్నవి. అటులనే మూలరామాయణములో గూడ ప్రథమమున రామకథ పంద్రెండు వేల శ్లోకములతో నుండవచ్చును; కాని అది పెరిగి, నేటికి 25000 అయి ఉండవచ్చును. ఈ విధముగా దక్కిన యన్ని గ్రంథములలో జేరినట్లుగా, రామాయణములోఁ గూడ వేల కొలది ప్రక్షిప్త శ్లోకములు చేరినవి.

ప్రథమ కాండములోనే 'భగవాన్ వాల్మీకి' సుందరమైన రామ చరిత్రము, ఆరు కాండములలో, 500 సర్గలలో, 24000 శ్లోకములలో రచించెనని చెప్పబడియున్నది. ఈ శ్లోక మెపుడు చేర్చినారో తెలియదు కాని, కనుంకరావచ్చుచున్నది.

శ్లో॥ చతుర్వింశత్సహస్రాణి శ్లోకానాముక్తవానృషిః
తథాసర్గ శతాన్పంచషట్ కాండాని సహోత్తరమ్॥

తా- ఋషి 24000 శ్లోకములు, 500 సర్గలు, ఉత్తర కాండ సహితముగా ఆరు కాండములు చెప్పెను.

ఈ శ్లోక ప్రకారము జూచినను ఆరు కాండములు, 500 సర్గలని యున్నది; కాని ఈనాటి రామాయణములో 764 సర్గలున్నవి. మొదటి కాండములో ననేక శ్లోకములు మూల రామాయణములోనివి, పలు పర్యాయములు చెప్పబడినవి. 'రామోపాఖ్యానము' రాముని పట్టాభిషేకముతో నంత మొందుట చేత, ఆఖరు కాండమగు 'ఉత్తర కాండము' కల్పితమని ఏకగ్రీవముగా సందరంగీకరించిరి. 'సహోత్తరమ్' అనుపదము అనుమానాస్పదముగా నున్నది. 'సోత్తరమ్ బ్రహ్మ పూజితమ్' అని ఉత్తర కాండమున మరియొక చోట గలదు. ఉత్తర కాండను వదలెదరేమోయని రామాయణ కర్త భయపడెనేమో !

రామాయణమునకు గాయత్రి కలదని, గాయత్రీ మంత్రములోని 24 అక్షరములు, ఒక్కొక్కటి శ్లోక సహస్రమును దెల్పునని, అందుచే నిందు 24 వేల శ్లోకములు కలవని, పండితులు పల్కుచుందురు; కాని దీని కాధారములు చూపరైరి. మూలరామాయణమున 12000 శ్లోకములు గలవని, క్రీ. శ. ఒకటవ లేక రెండవ శతాబ్ద ప్రాంతమున రచింపఁబడిన బౌద్ధ గ్రంథమగు 'మహావిభాష' అనుగ్రంథమునుబట్టి తెలియుచున్నదని, సుప్రసిద్ధ చరిత్రకారుడు 'హేమ చంద్రరాయ్ చౌదరి' వ్రాసెను.[7] కాన 12000

7. H. R. Choudary – Political history of Ancient India— P. 380— "The Present Ramayana Consists of 24000 slokas (1—4—2) But even in the first or second century A. D. the epic seems to have contained only 12000 slokas.

(J. R. A. S. 1907 P 99 ff) as the evidence of the Buddhist Mahavibhasha suggests"

నుండి, 25000 కు పైగా శ్లోకము లెపుడెపుడు చేర్చబడినవో తెలియ కున్నది. మొదట క్షత్రియుల కొరకు వ్రాయబడిన ఈ వీరగాథ మతగ్రంథ ముగా మారిపోయినది. అధిక భాగము బ్రాహ్మణ మతాభివృద్ధి గల్గిన, గుప్త రాజుల స్వర్ణయుగమని పేర్గాంచిన కాలమున గూర్చబడి యుండ వచ్చునని,యూహగల్గుచున్నది. గుప్తరాజుల రాజ్యారంభ కాలమున, వాయు పురాణము సంస్కరింపబడినదనుటకు, యాజ్ఞవల్క్య స్మృతి వ్రాయబడిన దనుటకు, ఆధారములు గలవు; కాని వాల్మీకి ప్రాచేతసునిచే రచింపబడిన 'మూలరామాయణము'లో బండ్రెండు వేల శ్లోకములు గలవని, 'మహా విభాష'కు బూర్వ గ్రంథములలో నెచటను గాన్పింపదు. 'స్కాంద పురాణము'లోని యొక శ్లోకమునుబట్టి, 'మూలరామాయణము' అను గ్రంథము, నాల్గు వేదములు, భారతము, పంచరాత్రకము తర్వాత నొక శాస్త్రముగా నుండెనని, ఉత్తర కాండములోని కొన్ని సర్గములు ప్రక్షిప్తము లగుట చేత, వ్యాఖ్య లేదని తెలియుచున్నది. ఈ శ్లోకము 'సర్వదర్శన సంగ్రహము'లో నుదాహరింపఁబడినదని, 'వీబరు' పండితుఁడు వ్రాసెను.[8]

ఇంకను 'రామాయణము' మానవ లోకములో 24 వేలని, అసలు శతకోటి యుక్తమని, దేవగంధర్వాది లోకములలోనిది 50 కోట్లు, 10 కోట్లు, కోటిగా వ్యాపించినదని, కొన్ని ఉపపురాణములు చెప్పు చున్నవి, వైష్ణవ సాంప్రదాయాను సారము వ్రాయబడిన 'తులసీదాసు' కృతరామాయణములో 'వాల్మీకి రామాయణము'లో లేని విషయము లనేకములున్నవి; దీనికి వారి శిష్యులు, రామాయణము శతకోటి పరిమిత మని, అందుచేత 'తులసీదాసు' యిష్టము వచ్చిన ఘట్టముల గైకొని వ్రాసెనని, కారణము చెప్పుదురు; కాని యివి యన్నియు కల్పనలు; చారిత్రక సత్యములు కాజాలవు. 'వర్తమాన రామాయణము'లో ఉత్తర కాండతో గూడ దాదాపు 25000 శ్లోకములుగలవు; ఏడు కాండములతోను కలిపిన దాదాపు 764 సర్గలున్నవి. మూల 'రామాయణము'లో ఐదు కాండములు మాత్రము కలవని, ఇందులోగూడ కొన్ని ప్రక్షిప్తశ్లోకములు

---

8. Sir M Williams—Indian wisdom. P. 338. Also Ibid P. 512 In all probability there were Mula or original Puranas, as there once existed also a Mula Ramayana and Mula Mahabharata"

చేరి యున్నవని, ఈ ప్రక్షిప్త భాగములు, శ్లోకములుగాక మిగిలినదంతయు, నొకేకవియగు 'వాల్మీకి' కృతియని, 'మాక్డనాలు' పండితుడు వ్రాసెను.[9] ఈ యభిప్రాయముతో మేము ఏకీభవించు చున్నాము. అక్షయ కుమార దేవి. స్మిత్, వీబర్, విలియమ్సు, మున్నగు విద్వాంసు లెల్లరు ఇట్లనే వచించిరి.[10] అనేక సార్లు 'రామాయణము' చదివినమీదట, నాకు పైయభిప్రాయము దృఢపడినది. బాలకాండ, ఉత్తరకాండలలోని అనేకవిషయముల బట్టి చూడగా, రాముని విష్ణువుయొక్క అవతారముగా వర్ణించుటకు వ్రాసిన భాగమని స్పష్టమగుచున్నది. 'హాప్కిన్సు' అను 'అమెరికా' సంస్కృత విద్వాంసుడు కూడ రాముడు మొట్టమొదట, స్థానికముగా వీరుడై యుండవచ్చునని, తరువాత విష్ణువుయొక్క అవతారముగా నంగీకరింపఁబడెనని వ్రాసెను. కొందరు విద్వాంసులు, అయోధ్యకు సంబంధించినంతవరకు రామ కథసత్యమని, అంతవరకే మూలరామాయణమని, తరువాత భాగమంతయుఁ గల్పితమని, వ్రాసిరి; కాని ఈ వాదన భాషకు, శైలికడ్డుపడు చున్నది.

అనేక భాగములు తరువాతవని, రాముని విష్ణువు యొక్క అవతారముగా జేసిన భాగములు, ఒకటవ ఏడవకాండములు ప్రక్షిప్తములని, మహాభారతమువలె చాలకాలమునకుఁగాని వ్రాతలోనికి రాలేదని, ఇదికూడ ప్రథమమున వాగ్రూపములో నిల్చియుండెనని 'వీబరు పండితుడు' వ్రాసెను.[11] 'విలియమ్సు పండితుడు' కూడ ఈ విషయములనే చెప్పెను. ఇవి సత్యములనియే, నేను భావించు చున్నాను.

'జాకోబి' యను జర్మనీ విద్వాంసుఁడు కూడ, 'మూల రామాయణము'లో నైదు కాండములు మాత్రమే కలవని, బాలకాండ, ఉత్తరకాండలు దరిమిలా చేర్పఁబడినవని, ఆరవకాండము యొక్క ఉపసంహారము, స్పష్టముగా నేదో కాలమున, సంపూర్ణకావ్యము యొక్క అంతమైయుండ

---

9. A. A. Macdonall—India's past. (1927) P. 91 Also Imperial Gazeteer Vol, II—P 237

10. A. K. Devi —A history of Sanskrit Literature P. 147—V, A. Smith—Oxford history of India P 27

11. A Weber—History of Indian literature P 194 M. M. Williams—Indian Wisdom P337.

వలయునని వ్రాసెను. ఆరవకాండ చివరలో (VI--130-150) 'వాల్మీకి యొక్క ఆది కావ్యము' ఇచట ముగింపబడినది, అని స్పష్టముగా వ్రాయబడి యున్నది. ఈ ప్రమాణము మనకు చాల ముఖ్యమైనది. ఇంకను 'జాకోబి' పండితుడు వ్రాసిన ఈ విషయములు గమనీయార్హములు.

ప్రథమకాండములో నన్యకాండములకు విరుద్ధవిషయములుగల అనేక శ్లోకములు గలవు.

2. అదియునుగాక ప్రథమ తృతీయసర్గలలో రెండు భిన్న భిన్న విషయ సూచికలు లభించుచున్నవి. అవి నిస్సందేహముగా భిన్న భిన్న కాలములలోఁ జేయఁబడినవి. ఇందులోని ఒక సూచికనుబట్టి, ప్రథమకాండకు ఉత్తరకాండకు రామాయణముతో సంబంధము లేదని, ఈ సూచిక ఈ రెండు కాండములు చేర్పకపూర్వమే రచింపఁబడినదని తెలియుచున్నది.

3. అదియునుగాక మూలగ్రంథమునకు ఉపక్రమణికగా ఉండువిషయము ఇపుడు ప్రథమకాండముయొక్క పంచమసర్గ ఆరంభములో నుంపబడినది. మూలకాండములోగూడ తరువాత కొన్ని సర్గలు చేర్చబడినవి. బాలకాండ, ఉత్తరకాండలు పైనచెప్పినవి కాక ఈక్రిందివి ప్రక్షిప్తములని 'జాకోబిపండితుడు' వ్రాసెను.

II. 41-9, 66-93, 107. (17-111), 117 (5-119)

III. 1-14.

IV. 17-18, 40-43, 45-47;

V. 41-55, 58-64, 66-88.

VI. 23-40, 59-60, 69, 74-75, 119.

శక, యవనాది వర్ణనముగల శ్లోకములన్నియు ప్రక్షిప్తములని 'జాకోబి' పండితుఁడు వ్రాసెను. ఇంకను బుద్ధ, బౌద్ధమతము, జాబాలి సంవాదములో బుద్ధుని చోరునిగా చూపించిన శ్లోకములు, ప్రక్షిప్తములని 'విలియమ్స్'

ఆరవ కాండములో సీత యొక్క అగ్ని ప్రవేశముగలదు. ఆసమయమున నందఱు దేవతలు, బ్రహ్మ, దశరథుఁడు వచ్చిరి. రామునితో వారు విష్ణువు అవతారమని, సీత లక్ష్మియని వారెల్లరెరింగించిరి. ఇవియన్ని ప్రక్షిప్తము లనుటలో సందియము లేదు.

ఉత్తరకాండము ప్రక్షిప్తమని, ఎల్లరంగీకరించిన విషయమే; ఇతరచోట్ల గల ప్రక్షిప్తశ్లోకములనుగూర్చి, 'భారతవర్షకే ఇతిహాస్' (ప్రథమ ఖండము) అను గ్రంథమున 'రామదేవజీ' యిట్లు ప్రస్తావించెను.

1. రాముడు వైదికధర్మరక్షణ సంబంధములో జెప్పిన అవైదిక సంస్కృత శ్లోకములు ప్రక్షిప్తములు. ఇవి మూలశ్లోకములకు విరుద్ధములు.

2. వామమార్గ సాంప్రదాయ సంబంధమగు అన్ని విషయములు ప్రక్షిప్త ములు; ఏలనన ఈకాలములో నెట్టి సాంప్రదాయములు లేవు.

3. ఆర్యవీరులు, వానరజాతి, రాక్షసకోటి, మనుజుల విషయములో ఏ సృష్టినియమవిరుద్ధ విషయములుగలవో, అవియన్ని ప్రక్షిప్తములు.

4. ఏవిఏవి ప్రకరణ విరుద్ధములుగలవో, అవియన్ని ప్రక్షిప్తములు.

5. యుద్ధకాండములో ననేకప్రక్షిప్త శ్లోకములు గలవు.

6. యుద్ధకాండములోని 128 వ కాం. 105, 110 శ్లోకములు వాల్మీకి రచితములు కావు.

7. ఉత్తరకాండములో సృష్టి నియమ విరుద్ధ విషయములు కలవు. ఇవి అగ్రాహ్యములు కాజాలవు. ఇటలీ విద్వాంసుడు 'గరోసియో' ఆరు కాండ ములు మాత్ర మనువదించెను. అందుచేత ఈ ఏడవ కాండము ప్రక్షిప్తమే.

8. బాలకాండము మూడవ సర్గలో రామకథ సంక్షేపముగా గలదు. అచట యుద్ధకాండము వరకు, కథాసారము గలదు; ఏకాండము పేరు లేదు; కాన చివర భాగము ప్రక్షిప్తమై యుండవలెను. అంతిమ శ్లోక మిట్లున్నది. "తచ్చకారోత్తరే కావ్యే వాల్మీకి భగవానృషిః॥ ఈ శ్లోకము ప్రతికూలమైనది; అందుచేనిది ప్రక్షిప్తము.

9. ఉత్తరకాండ అంతిమసర్గ॥, ప్రథమశ్లోకములో

శ్లో॥ ఏతావదేత దాఖ్యానం సోత్తరం బ్రహ్మపూజితమ్
రామాయణమితి ఖ్యాతం ముఖ్యం వాల్మీకి నాకృతమ్.

తా. ఈ కథ ఉత్తరకాండ సహితముగా, బ్రహ్మపూజితము; ఇంత ప్రసిద్ధమైన ముఖ్య రామాయణమును వాల్మీకి చెప్పెను. 'సోత్తరం' అను పదము సందేహాస్పదమై యున్నది. రామాయణములోని ఉత్తరకాండము, దరిమిలా చేర్చబడుటచేత, దానిని పూజింపరని ఇట్లు వ్రాసి యుండుట నిక్కువము.

10. 'చంపూరామాయణము' మహారాజ భోజకాలమున వ్రాయబడినది. ఇది వాల్మీకి రామాయణ సారమని ఇందే కలదు. 'చంపూ'లో యుద్ధకాండము వరకు మాత్రమేకలదు. కాన రామాయణములో నారు కాండములు కలవు. లవకుశుల కథయున్నచో నిందు చేర్చెడివాడే; కాన యిది కల్పితము. ఉత్తరకాండ విషయసూచి కూడ నిందు చేర్చి యుండెడి వాడే; అట్లులేనందున ఈ కాండ ప్రక్షిప్తమే.

11. ఈ ప్రమాణములే కాకుండ, ఉత్తరకాండలోని ఈ ప్రమాణములను బట్టి, ఉత్తరకాండ వాల్మీకి రచితము కాదని తెలియుచున్నది.

శ్లో॥ ఉపాఖ్యాన శతంచైవ భార్గవేణ తపస్వినా (94–25)
ఆది ప్రభృతి వైరాజన్ పంచసర్గశతా నీచ
కాండానిషట్ కృతానీహ సోత్తరాణి మహాత్మనా (94–26)

తా. భార్గవ తపస్విరామాయణములో 100 ఉపాఖ్యానములు గలవు. ఓరాజా! రామాయణములో ఆదినుంచి 500 వరకు సర్గలుగలవు. ఈ ఆరు కాండములు ఉత్తరకాండ సహితముగా భార్గవ మహాత్ముడు చేసెను.

కాని ఉత్తరకాండము వాల్మీకి రచితము కాదు. ఈ చరిత్రకారుని అభిప్రాయముతో జాలవరకు మేము ఏకీభవించుచున్నాము.

శైలినిబట్టి ఉత్తరకాండము ప్రక్షిప్తమని పలువురు విద్వాంసులు వ్రాసిరి. ఉత్తరకాండము చేరిన తర్వాత బాల కాండముతో దీనికి సంబంధము కల్గుటకు, బాలకాండ 3,4 సర్గలు చేర్చియుండుట నిజము.

'పురాతన మూలరామాయణము' బౌద్ధమతోదయమునకు బూర్వమే కలదని, అది చారిత్రకము కాదని, కవియొక్క ఊహామాత్రమైన రచనా సృష్టి

యని సి.వి. వైద్యా వ్రాసెను;[14] కాని మూలరామాయణ మంతయు కవి కల్పితమని యంగీకరింపఁజాలము. రామకథలోఁ గొంత సత్యము కలదని మాయూహ. 'పి.టి. శ్రీనివాసయ్యంగారు' అను చరిత్రకారుడు, 'వాల్మీకి ప్రాచేతసుడు' రచించిన రామాయణమును, క్రీ.పూ. 7వ శతాబ్దములోఁ గాబోలు ఉన్న 'వాల్మీకి' లౌకిక సంస్కృతములో బునర్వ్యవస్థ చేసియుండెనని వ్రాసెను.[15] 'పర్జిటరు' అను విద్వాంసుడుకూడ ఈమత మంగీకరించెను; కాని ఇరువురు 'వాల్మీకి' కవులున్న ఆధారములు మాకు లభింపలేదు.

రామకథ ఇంకను పురాతన గ్రంథములగు దశరథ జాతకములో, 'మహాభారతము రామోపాఖ్యానము'లోను గలదు. దీనికి కథా బీజము 'మూలరామాయణమే' కావచ్చును. రామకథ బుద్ధుని జీవిత కథలలో నున్న దానినే, వాల్మీకి చేతులలో మార్పు' చెందెనని 'వీబరు' అభిప్రాయ పడెను. కాని యిది సరికాదు. వాల్మీకి కాలనిర్ణయము నీ జర్మను పండితుఁడు చేయలేక పోయినాడు. 'విలియమ్సు' అను పండితుడు కూడ 'వీబరు' మతమును నిరాకరించెను. మూలరామాయణము జాతక కథలకంటె చాల పూర్వపు దగుట నిశ్చయము. 'వాల్మీకి ప్రాచేతసుఁడు' రచించిన ఈ మూలరామాయణములో 12000 శ్లోకములు, 5 కాండములు కలవు. 'మహావిభాష' రచనా కాలమునాటికి కిందు 12000 శ్లోకము లుండుటయే దీనికి ప్రమాణము. బాలకాండము, ఉత్తరకాండము, ఇంక ననేక ప్రక్షిప్త శ్లోకములుగల వర్తమాన రామాయణముగా తరువాత విద్వాంసులు తయారు చేసిరి. వేదాదులవలె నీకావ్యమును భద్రపరచి యుండక పోవుటచేత, వాగ్రూపమునుండి, వ్రాతలోనికి వచ్చులోపుగా, ననేక మార్పులు జరిగినట్లు స్పష్టపడుచున్నది. "విషయములు సమానముగా నుండుట, భాష భిన్నముగా నుండుట మున్నగునవి చూడగా, గ్రంథము వ్రాతలోనికి, వేరువేరు

---

14 C. V. Vaidya M.A.L L.B — The riddle of Ramayana P 75 "It (Old Ramayana) of Valmiki, which existed before the rise of Buddhism has itself no histrical basis, but is a mere creation of a poet's imagination.

15 P. T. Srinivasayyangar, History of the Tamils- P 46 "Probably this Valmiki of the 7th Century B. C. revised the Ramayana of 'Valmiki Prachetasa' in classical Sanskrit."

దేశములలో స్వతంత్రముగా వచ్చినవని, చెప్పవలసి యున్నవని, ఇంకొక విధముగా సమన్వయ పరచ వీలులేదని, 'వీబరు' పండితుడు వ్రాసెను.[16] ఈ యూహ సత్యముగా గాన్పించు చున్నది.

ఇట్లు వర్తమాన రామాయణము, మహాభారతమువలెనే మూడు ఆవృత్తులను జెందినట్లు తోచు చున్నది. ఎవరి యిష్టాను సారమువారు, వేరువేరు కాలములలో ఆయామత, సాంఘిక వ్యవస్థలను బట్టి శ్లోకములు చేర్చి యుండుటచేత, చారిత్రక భాగములుగల 'వాల్మీకి ప్రాచేతసుని' మూల రామాయణమును, ఇదమిత్థమని తేల్చలేకున్నాము.

---

# 3. రామాయణ కర్తృత్వము - ఉత్పత్తిస్థానము

రామాయణకథ కోసల ప్రాంతమగు అయోధ్యకు సంబంధించినది. ఇక్ష్వాకు రాజవంశము ఆ కాలమున రాజ్యపాలన చేయుచుండెను. ఈ రాజవంశముతో వాల్మీకి కవికి సంబంధ మున్నట్లు రామాయణమునుబట్టి, స్పష్టపడుచున్నది.

ఉత్తరకాండలోని 45 వ సర్గనుబట్టి, బాలకాండము రెండవసర్గ 3, 4వ శ్లోకములను బట్టి వాల్మీకి ఆశ్రమము గంగయొక్క దక్షిణపు ఒడ్డున, తమసా నదీతీరమున (బిఘూరు-కాన్పూరు దగ్గర) నుండెనని తెలియు చున్నది. సీతను వాల్మీకి ఆశ్రమమునకుఁ దీసికొని పోవుట, కుశలవులు వాల్మీకి ఆశ్రమమున జన్మించుట రామాయణకథను అచటనే కుశలవులు నేర్చి

---

16. A. Weber :- The history of Indian literature P 194 "This is hardly to be explained save on the theory that this finding of the text in writing took place independently in different localities."

దేశదేశములలోఁ బాడుట, మున్నగు వానిని బట్టి, బాలకాండ ఐదవ సర్గనుబట్టి, రామాయణము ఇక్ష్వాకు రాజవంశములోనే ప్రాదుర్భూతిమైన దని చెప్పవచ్చును. అయోధ్యలో గాయకులు రామునిగూర్చి పాటలు పాడు చుండుట విని, వాని నన్నిటిని జేర్చి, కూర్చి వాల్మీకికవి రామాయణముగా బాడియుండ వచ్చును. దీనిని కుశలవులు, గాయకులు, సంగీతపాఠకులు నేర్చినతర్వాత దేశదేశములలోఁ బాడుచుండిరి. ఈ కథలోని భూగోళ శాస్త్రము వినసొంపుగా నుండి, దూరప్రాంతములకు సంబంధించి యున్నను, విశ్వసించుటకు వీలులేనిదని 'విలియమ్సు' అను విద్వాంసుఁడు వ్రాసెను. ఇందలి యోజనముల లెక్కలు మున్నగునవి చూడగా, నీ విషయము సత్య మనియే తోచు చున్నది.

ఈ 'వాల్మీకి ప్రాచేతసుఁడు' రాముని సమకాలీనుఁడు. ఒక వాల్మీకి యొక్క పేరు 20 మంది ఋషులతో బాటు, 'తైత్తిరీయ ప్రాతిశాఖ్యము' లోఁ గాన్పించు చున్నది. ఇది కృష్ణ యజుర్వేదసూత్రము; ఇందు 'ఆత్రేఁయ, కౌండిన్య, భారద్వాజ, అగ్నివేశ్య, అగ్నివేశ్యాయన, పౌష్కరసాది ఋషులతో బాటు, వాల్మీకి పేరుకలదు. ఈ 'వాల్మీకి' ఎవరు ? ఈ పేరు గల వారెవ్వరు నిం; నితరచోట్ల కాన్పింపమి, ఈ తఁడే రామాయణకర్త కావచ్చునని 'వీబరు' అభిప్రాయపడెను.[17] 'పర్గిటరు' ఒక ఋషుల పట్టీ నొసంగుచు, దశరథుని సమకాలీనునికి రెండుతరముల తర్వాత, ఒక వాల్మీకి జీవించియుండెనని వ్రాసియుండెను. రామకథను ఈ 'వాల్మీకి' పాడెనని, తర్వాత దానిని కుశలవులకు నేర్పి పాడించియుండవచ్చునని, తరు వాత కాలములోనివాఁడగు, మరియొక వాల్మీకి, ఈ రామాయణమును మరలఁజెప్పెనని, ఆ వాల్మీకియే, ఈ వాల్మీకియని, అందరభిప్రాయ పడు చుండిరని, 'పర్గిటరు' వ్రాసెను. 'తైత్తిరీయ ప్రాతిశాఖ్యము' లోని 'వాల్మీకి' రెండవవాఁడని 'పర్గిటరు' అభిప్రాయమై యున్నది. కాని దానిని నిరూపించుటకు వలయు ప్రమాణములు మాకు లభింపలేదు.

భారతములోని రామాఖ్యానమున, భార్గవుడైన వాల్మీకి పేరు కాన్పిం చును. భారతమున నితరచోట్లనుఁడ, రామాయణము పేరు, వాల్మీకి మహా తపస్వి పేరు కాన్పించును. రామాయణము, భారతము, అష్టాదశపురాణ

[17] A. weber—The history of Indian literature P 191

ములు 'జయ' సంజ్ఞగలవని, రామాయణము ఆర్షమని, వేదసమ్మతమని, పండితులు వ్రాయుట చూడగా, ఈ రామకథకు బీజము వేదమేయని, వేద కాలమునాటి ఋషియే దీని రచయితయని, తెలిసికోవచ్చును. ఈతడు కృష్ణ యజుర్వేద శాఖకుఁ జెందినవాఁడు; తైత్తిరీయకులలో నీకథ భద్రపరచబడి, వాఙ్మూపముగా వచ్చియుండవచ్చును. "భృగుర్వై వారుణిః" అను తైత్తిరీయ వచనమునుబట్టి, వాల్మీకి వరుణవంశజుడు, భృగువంశీయుడు అని తెలియుచున్నది. వాల్మీకి తపసు చేసికొను చుండగా, చుట్టును పుట్ట పెరిగెనని, అందుచేత బ్రహ్మ ఈ ఋషిని, 'వాల్మీకి' యని పిలిచెనని, పురాణములు తెల్పుచున్నవి. ఈ ఋషి పేరు 'భార్గవ' యని, 'ప్రాచేతస' యని యందురు. మొదటి పేరునుబట్టి ఈతడు భార్గవ కుటుంబమునకుఁ జెందిన వాఁడని, తండ్రి ఎవరో భృగువంశజుఁడని, ఊహింప వచ్చును. 'ప్రాచేతసుడు' అనునది వరుణుని పేరు. ఈ ఋషి చుట్టు పుట్టలు పెరుగఁగా వరుణుఁడు లేక వర్ష దేవుఁడు వర్షము కురిపించి, పుట్టలను గొట్టి వేసెనని ప్రపంచము లోనికి ఋషిని బయట పడవేసెనని తెలియుచున్నది. ఈ విధముగా 'వరుణుడు' వాల్మీకి తండ్రిగా బరిగణింప బడుచున్నాడు. వాల్మీకి బందిపోటు దొంగయని, నారదుఁడు రామ మంత్రోపదేశము చేసెనను పురాణగాథలు ఎంతవరకు సత్యములో తెలియదు. కాని ఒక నారదుఁడు, దశరథ దివోదాస, వాల్మీకుల సమకాలీనుఁడుగా కాన్పించు చున్నాడు.

'నారద, పర్వత, అరుంధతి అనువారు కశ్యప కుటుంబములోని వారు. నారదుఁడు రెండవ కశ్యపుడు. ఈ నారదుఁడు తన కుమార్తెయగు అరుంధతిని వశిష్ఠున కిచ్చెనని, వాయుపురాణము తెల్పు చున్నది.

వశిష్ఠునికి శక్తి, శక్తికి అదృశ్యంతి వలన పరాశరుడు కల్గిరి. ఈ 'శక్తి'నే ఇక్ష్వాకురాజు, కల్మశ పాదుఁడను రాక్షసుఁడు, విశ్వామిత్రుని ప్రేరణచేత వధించెను. అందుచేత 'పరాశరుఁడు' రాక్షసవంశ నిర్మూలనమునకు బయలుదేరెను కాని, తాత యగు వశిష్ఠుఁడా ప్రయత్నము మాపెను. సహదేవుని కుమారుఁడు సోమకుఁడు, నారద పర్వతుల యొద్ద రాజధర్మములను గూర్చి నేర్చిరని 'ఐతరేయ బ్రాహ్మణము' తెల్పుచున్నది. గురుశిష్య క్రమములో 'సామవిధాన బ్రాహ్మణము' (3_9_3) లో నారదుని పేరుకలదు.




వాల్మీకి సమకాలీనుడీ నారదుడే కావచ్చును. 'మహాభారతకాలమున మఱియొక నారదుఁడు కాన్పించును. నారాయణ ఋషి' బోధలను విని 'నారదుఁడు' బదరి కేగెను. అటనుండి 'గంధమాదన' శ్వేతదేశముల కేగెను. 'నారాయణ ఋషి' నారదునికి పురుషసూక్త భావముల వినిపించెను. తర్వాత నారదుఁడు నైమిశారణ్యములో వేదవ్యాసునికి పురుషసూక్త భావముల దెలిపియుండెను. ఈ వ్యాసుడు వీనిని శ్రీకృష్ణ యుధిష్ఠిర, భీష్ములకుఁ జెప్పెనని భాగవతము, మహాభారతము తెల్పుచున్నవి. కనుక వాల్మీకి కుపదేశించిన నారదుఁడు రెండవ నారదుఁడు కాజాలడు.

ఈ 'వాల్మీకి'కి వేదవిభజనతో సంబంధ మున్నట్లు పురాణములు దెల్పుచున్నవి. అత్యంత పురాతనములగు వాయు, విష్ణుపురాణములు, వేదముల విభజించిన 28 మంది వ్యాసులను బేర్కొన్నది. 'కూర్మపురాణము' కూడ వీరిని బేర్కొన్నది. వీరెల్లరు వేదవ్యాస బిరుదాంకితులు. ఇందు 24వ వేదవ్యాసుఁడు రామాయణమును బాడినట్లు తెలిసికొన వచ్చును. ఈతఁడు 'వల్మీక భార్గవుని' కుమారుఁడగు ఋక్షుఁడు. ఈయనకు 'భార్గవుఁడని, వాల్మీకియని, వాల్మీకి ప్రాచేతసుఁడని, భవ్యుడని పేర్లు కాన్పించును.

28 మంది వేదవ్యాసుల పేర్లీదిగువ నుదహరించుచున్నాను. 1. స్వాయంభువు, 2. ప్రజాపతి, 3. శుక్రుడు, 4. ప్రజాపతి, 5. సవిత, 6. మృత్యువు 7. ఇంద్రుడు, 8. వశిష్ఠుడు, 9. సారస్వతుడు, 10. త్రిధాముడు, 11. వృషభుడు, 12. శతతేజుఁడు, 13. ధర్ముఁడు, 14. తరసుఁడు, 15. త్రైర్యారుణి

16. ధనుంజయుడు, 17. క్రతుంజయుఁడు, 18. ఋతుంజయుఁడు, 19. భరద్వాజుడు, 20. గౌతముడు, 21. వాజశ్రవుఁడు, 22. శుష్మాయణుఁడు, 23. తృణబిందుఁడు, 24. ఋక్షుఁడు, 25. శక్తి, 26. జాతుకర్ణుఁడు 27. పరాశరుఁడు, 28. కృష్ణద్వైపాయనుఁడు.

ఈ 24 వ వేదవ్యాసుఁడగు 'ఋక్షుడే' రామాయణ కర్త. ఈయన భారద్వాజవాజ్షేయ, దివోదాస, ప్రస్తోక సరంజయ, అభ్యావర్తిన చాయమాన, దశరథ, గౌతములకు సమకాలీనుఁడు. దివోదాసుని పురోహితుఁడగు, భారద్వాజుని ఆశ్రమమునకు రాముఁడేగినట్లు, రామాయణము దెల్పుచున్నది.

ఈ 'దివోదాసుని' సోదరి 'అహల్య' నే 'సరద్వంత గౌతమునికిచ్చి వివాహము చేసిరని, వాయుపురాణము హరివంశము' మున్నగు గ్రంథములు దెల్పును. ఈమె కుమారుఁడు 'శతానందుడు' సీత తండ్రియని చెప్పబడు 'శీరధ్వజ జనకునికిఁ బురోహితుడు. 'దివోదాసుడు' శంబరాసురుని రాజధానియైన 'వైజయంతి' కేగి, అనేక పురముల దగ్ధముఁ జేసెనని దశరథుఁడు కూడ ఈ యుద్ధమున సాయపడెనని తెలియు చున్నది. ఈ దేవాసుర యుద్ధము బ్రహ్మ పురాణాదులలో వర్ణింప బడినది. గధమునకు చీలపోవుట, కైకేయి సాయమున యుద్ధములో 'తిమిధ్వజ శంబరుని' ఓడించుట, మున్నగునవి చారిత్రక సత్యములే కావచ్చును. 'రోమపాదుని' కూతురగు 'శాంత'ను వివాహమాడిన 'ఋష్యశృంగుడు' కూడ వీరి సమకాలీనుఁడే.

మూలరామాయణ కర్తయగు ఋక్షుఁడెవరో తెలిసికొన వలసి యున్నది. ఈ ఋక్షులు ముగ్గురున్నారు. మొదటివాఁడు 'హస్తినాపుర రాజగు 'అజామిఢుని' చిన్న కుమారుఁడు; ఇతని కుమారుడు 'శంబరానుఁడు' చాల ఏండ్లేలి, పాంచాల రాజుతో యుద్ధమాడి అపజయము గాంచి పారిపోయెను. ఈతడు సింధునదిపైన చాలకాలముండి, ఋషివివస్వంతుని కుమార్తెయగు 'తపసి వైవస్వతిని' వివాహమాడెను. ఒక వశిష్ఠుని సాయమున తన రాజ్యము సంపాదించెను. ఈ వంశవృక్ష మిట్లున్నది.

అజామిఢుడు. కురు. (భార్యవాహిని)

|                 |

ఋక్ష I  అవిక్షిత - చైత్రరథ - అభిస్యంత - ముని-జనమేజయ

|                 |

శంబరన  పరీక్షిత

|  జనమేజయ

సురథ

(అగ్నిపురాణములో త్రసదస్యు అనిఉన్నది.)

ఈ 'సురథ' ఉత్తర పాంచాలరాజు, 'అతిథిగ్వదివోదాసుని' తండ్రి 'వాధ్ర్యస్యుని' సమకాలీనుడు. దివోదాసుడు దశరథుని సమకాలీనుడు కాన, ఈ వంశములోని 'ఋక్షుడు' కానేరడు.

2. కురు (వాహిని వలన ఐదుగురు పుత్రులు.)

|

చైత్రరథ—అవిక్షిత—అభిస్యంత—ముని—జనమేజయ.

|

జహ్ను—సుధన్వన—అరిమర్దన.

|

సురథ.

|

విదూరథ—ఈతడు 'వాధ్ర్యస్యుని' సమకాలీనుడు.

|

సార్వభౌమ—ఋక్ష II—భారద్వాజ. (బ్రహ్మపురాణములోనున్నది.)

వీరు అతిథిగ్వ దివోదాసుని లేక దశరథుని సమకాలీనులు. ఇందలి ఋక్ష, భారద్వాజులు అంగిరసశాఖా ఋషులుగా మారినారు. మత్స్య పురాణమును బట్టి, వీరు ప్రవరులనువదలి వేసిరనుట తథ్యము. మహాభారతమునుబట్టి, 'విదూరథుని' కుమారుని ఋక్షవంత పర్వతముపై, భల్లూకములు పెంచెనని, ఈయనకందుచే 'ఋక్ష' యనిపేరు వచ్చెనని తెలియుచున్నది. ఈతడే II వ ఋక్షుడు. ఈతడే 'రామాయణ కర్త' యని మాయూహ. ఈతడు బహుశ మొదట వనంబులందు బోయవాడుగా

నుండి, భల్లూకాదులతోఁ గొన్నాళ్ళు గడపి, నారదుని ఉపదేశమును గ్రోలి తపసు చేసికొని యుండవచ్చును. వల్మీకముకూడ పెరిగెనేమో! వర్షము చేత నీభూట్టలు కరిగిపోయి యుండవచ్చును.

3 హస్తినాపుర మేలిన 'పౌరవ వంశము'లో నింకొక 'ఋక్షుడు' కలడు. ఆవంశవృక్ష మిట్లున్నది.

దేవతిథి.

|

ఋక్ష III

|

భీమసేన.

కనుక హస్తినాపుర శాఖలోనే ఇద్దరు ఋక్షులు కలరు. మొదటివాఁడు' మూఁడవవాఁడు ఈ శాఖకు జెందినవారు. మొదటివాఁడు శంబరుని తండ్రి; రెండవ ఋక్షుఁడు 'అంగీరసశాఖకు గురువు; రామాయణ కర్త యగుచున్నాడు; కాని III వఋక్షుఁడు రామాయణకర్త కాఁజాలడు. ఈ ప్రకారము 'రామాయణ రచయితయగు' ఋక్షుడెవ్వరో తెలిసికొంటిమి.

రామునితండ్రి దశరథుఁడు, ఉత్తర పాంచాలరాజు 'అతిధిగ్వదివోదాసు' (అహల్యా సోదరుడు) దక్షిణ పాంచాలరాజు 'సేనజిత్', విదూరథుని కుమారులు సార్వభౌమ, ఋక్షులు, కృత, అంగరాజు రోమపాదుఁడు, శీరధ్వజ జనకుఁడు, యదువంశరాజు సత్వంతుడు, వీతహవ్యుని కుమారుఁడు 'హైహయుడు' వీరెల్లరు సమకాలీనులు.[18]

ప్రాచీన భారత కాలనిర్ణయమును జేసిన 'సీతానాధ ప్రధాన' అనేక వంశవృక్షములను బరిశీలించి 'స్వతంత్ర రాజవంశమునుబట్టి, దివోదాసునికి మహాభారత యుద్ధకాలమునకు 12 తరములుండునని అంగశాఖలో 'రోమపాదునినుండి 13 తరములుండునని మగధశాఖలో 13 తరములుండునని ఉత్తర పాంచాల వంశములో 12 అని, కాశీ శాఖలో 13 అని, ఇక్ష్వాకు జనకవంశములో 15 అని, ఈ ప్రకారము 12 రాజ వంశములఁ బరిశీలించిన పిమ్మట, 12 మొదలు 15 తరముల అంతరము

18. Dr. S. N. Pradhan— Chronology of Ancient India —P 30

కాన్పించు చున్నదని వ్రాసెను.[19] సగటున 13 వేసి, మహాభారత యుద్ధము క్రీ. పూ. 1150 ప్రాంతమున జరిగినది కాన రాముని లేక వాల్మీకి కాలము క్రీ. పూ. 1450 ప్రాంతమగునని పై లేఖకుఁడు వ్రాసెను. కాని ఈ గ్రంథకర్త తరముల కిచ్చిన సంఖ్య అధికముగా నున్నది. భారత యుద్ధకాలము తప్పుగా నున్నది. నా యంచనా ప్రకారము భారత యుద్ధము క్రీ. పూ. 950 ప్రాంతమున జరిగెను. 'పర్గిటరు' తన 'ప్రాచీన భారతీయ ఐతిహాసిక అనుశ్రుతి' అను గ్రంథమున, 'సిద్ధాంత' తన 'భారతవర్షములోని వీరయుగము' అను గ్రంథమున, నేను చెప్పిన కాలమునే యిచ్చిరి;[20] కాని కొందరు భిన్న భిన్న కాలముల నొసంగిరి. అక్షయ కుమార దేవి భారత యుద్ధకాలము క్రీ. పూ. 1062 లోనని వ్రాసెను. 'హేమచంద్రరాయ్' పరీక్షిత్తు రాజ్యారోహణ కాలము క్రీ. పూ. 1350 ప్రాంతమని పురాణేతిహాసములనుబట్టి తెలుచున్నదని, వ్రాసెను. దత్తు పండితుడు ప్రాచీన భారతవర్షము అను గ్రంథమున, కురుపాంచాల యుద్ధము క్రీ. పూ. 13 వ శతాబ్దిలో జరిగెనని వ్రాసెను.[21] కాని ఈ యూహలు అనేక కారణములచే సరికావని, నేను నా మహాభారత విమర్శనమున వ్రాసియుంటిని.

ఒక లేఖకుడు, రాముఁడు పాండురాజునకు 14 తరముల క్రితముండెనని వ్రాసెను. దీని ప్రకారము జూచిన వాల్మీకి లేక రాముడు క్రీ. పూ. 12 లేక 13 వ శతాబ్ది ప్రాంతమున నున్నట్లు తెలుచున్నది. ఇంకను 'పర్గిటర్' పరిశోధించిన జాపితా ప్రకారము మనువునుంచి రాముడు 65వ వాఁడని కృష్ణుని సమకాలీనుఁడగు 'బృహద్బలుఁడు ఈ వంశవృక్షములో 94వ వాడని, తెలియుచున్నది. ఉభయులకు 29 తరముల అంతరమున్నది; కాన II వ ఋక్షుడను రామాయణకర్త, దశరథ సమకాలీనుడగుటచేత, భారతయుద్ధకాలమునకు 29 తరములముందు జీవించి యుండవచ్చును. భారత యుద్ధము క్రీ. పూ. 950 ప్రాంతమున జరిగినది. సార్వత్రికముగా ఒక తరమునకు 16 ఏండ్లు తీసుకొందురని 'జయచంద్ర విద్యాలంకారు' మున్నగు విద్వాంసులు వ్రాసిరి. కాన వాల్మీకికాలము క్రీ.పూ. 950+29×16= క్రీ.పూ. 1414 అగును. రాజవంశ

19· Ibid —P 169

20 N. Siddhanta—Heroic age in Ancient India P 37

21 R. C. Dutt—Ancient India P 40.

షుల లెక్క ప్రకారము క్రీ.పూ. 950+13×16 = క్రీ.పూ. 1158 అగును. 'ప్రధాని' లెక్క ప్రకారము క్రీ.పూ. 1450 అగుచున్నది; కాన మూటిని సగటు చేసిన క్రీ. పూ. 1340 ప్రాంతమగుచున్నది. కాన రాముడు, వాల్మీకి మున్నగువారు క్రీ.పూ. 14 వ శతాబ్ద ప్రాంతమున జీవించి యుండిరనియు చెప్పవచ్చును. కాన మూలరామాయణ రచన ఈ కాలముననే జరిగి యుండ వచ్చునని మాయూహ. రామాయణ కర్త ఎవరో సరిగా నిర్ణయించి, అతని కాలనిర్ణయమును సహేతుకముగా జేసినవారెవ్వరు లేరు; కాన పండితులు దీనిని గైకొని చర్చించెదరుగాత!

'ఋక్షభార్గవుడు' మూలరామాయణమును, వేదభాష అనుష్టుభ శ్లోకములతో వ్రాసియుండెను. 'మానిషాద ప్రతిష్టాం' మున్నగుమాదిరి శ్లోకములుగల రామాయణములో, నేడు సంస్కృత శ్లోకములు మార్పు జెందినవి. 'ఋక్ష వాల్మీకి' వేదమంత్రముల 'తృణబిందు ఋషి' పద్ధతిలోఁ జెప్పనెంచెను. ఈ 'ఋక్ష వాల్మీకి' ననుసరించి వశిష్ఠుని కుమారుడు 'శక్తి' వేద రచన చేయసాగెనని విష్ణుపురాణము (III - 3. 17, 18) 'తృణబిందుడు' 23 వ వేదవ్యాసుడు, శక్తి 25 వ వేదవ్యాసుడు నైయున్నారు ఈ ప్రకారము 24 వ వేదవ్యాసుడు భార్గవుడైన వాల్మీకి యను ఋక్షుడు రామాయణ కర్తయని తేలినది. కూర్మ పురాణాదులు వాల్మీకి పేరే చెప్పినవి. కాని ఈ వాల్మీకి ఆదికవి. రామాయణమును తోలుదోల్త లిపి వ్రాత, లేఖన సామగ్రి లేని కాలమున పాడియుండెను. వేదకాలములోనే ఇతిహాసములు కలవా? యని కొందరి సందియము. ఇతిహాసముల పేర నేక ప్రాచీన గ్రంథములలోఁ గాన్పించుటయే దీనికి ప్రమాణము.

1. శతపథబ్రాహ్మణము: (14 - 6 - 10 - 6)లో నిట్లున్నది.

మం॥ ఋగ్వేదో యజుర్వేదః సామవేదో ఽథర్వాంగిరస
ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః శ్లోకః॥

అందే (11 - 5 - 6 - 8) యిట్లున్నది.

మం॥ "యదను శాసనాని విద్యావాకో వాక్యమితిహాస
పురాణం గాధా నారాశ ఋస్యః॥

ఇంకను (13 - 4 - 3, 12 - 13) "ఇతిహాసో వేదః పురాణం వేదః" అని యున్నది.

2. ఛాందోగ్యోపనిషత్తు 7–2 లో "ఇతిహాస పురాణం పంచమం వేదానాం వేదం బ్రహ్మవిద్యాం భూతవిద్యాంక్షత్ర విద్యానక్షత్ర విద్యా, సర్పదేవ జనవిద్యామే తద్భగవోఽధ్యేమి." II.

3. మహాభారతము అశ్వమేధ పర్వము III–58లో "ఇతిహాస పురాణంచ గాథాశ్చో పనిషత్తథా II"

4. తైత్తిరీయారణ్యకము 2–9 లో

"బ్రాహ్మణా నీతిహాసాన్ పురాణాని కల్పాన్ గాథా నారాశంసీరితి"

5. అశ్వలాయన గృహ్యసూత్రములో

"యద్ బ్రాహ్మణాని కల్పాన్ గాథా నారాశం సీరితిహాస పురాణానితి."

ఇత్యాది వచనముల బట్టి బ్రాహ్మణ రచనా కాలము (క్రీ. పూ. 800—600) నాటికి, ఇతిహాసములు, పురాణములుండుట నిశ్చయము. అవి మూల రామాయణము, మూల భారతము, మూల పురాణములు కావచ్చును. ఇవి యన్నియు లిపిలేని కాలములోని వగుటచేత పండితులు వీనిని తమ ధారణశక్తిచేత మేధస్సున నిల్పి, వాగ్రూపమునఁ బాడుచు, శిష్యక్రమమున నందించి యుండుట నిశ్చయము.

---

# ౪. రామాయణ శాఖలు

రామాయణ శాఖలు మూడు విభిన్న భేదములుగా నున్నవి. 'మాక్డొనాల్డు' యిట్లు విభజించెను. 1. పశ్చిమ భారతీయ. (కాశ్మీర) 2. వంగ, 3. బొంబాయి ప్రాంతీయ. (మహారాష్ట్ర ప్రాంతము) ఒకదానిలోని క్షేపక శ్లోకములు, మిగత రెంటిలోను దేనిలోను లేవు. బొంబాయి ప్రాంతీయ ప్రతిలో నత్యంత పురాతన భాగములగు అసలి భాగములు సురక్షితముగా గాన్పించుచున్నవి. మిగత రెండును గౌడ, వైదర్భి శైలిగల రచనలు వ్యాప్తిలోనున్న లౌకిక సంస్కృత సాహిత్యముగల ఆయా కేంద్రములలో ప్రాదుర్భూత మైనవి. కావ్య భాషకు భిన్నమైన క్రమవిరుద్ధములెందు త్రోసివేయఁ బడినవి. అచట క్రమముగా భాష నవీనాచరణము వాల్చెను.

దేశకాలములనుబట్టి విను వారిని, జెప్పువారిని బట్టి భేదమేర్పడు చుండెను. అందుచేత వ్రాత యారంభమగునాటికి మూలరామాయణములో నిట్టి భేదము లేర్పడినట్లు తెలియు చున్నది. అందుచేత మూడును వేరు వేరు రూపముల దాల్చెను. ఈ ప్రకారము భారత పురాణాది గ్రంథములు మార్పు జెందినట్లు, రామాయణము కూడ విభిన్న రూపము దాల్చెను. క్రీ.శ. 8-9 శతాబ్దములనాటి పుస్తకములలోని శ్లోకములఁబట్టి, చూడగా వీరు పశ్చిమోత్తర ప్రతినుండి, మహారాష్ట్ర ప్రతినుండి అనేక విషయములు గైకొన్న ఆధారములు గలవు. ఇంతియేకాక 11 వ శతాబ్దములోని 'రామాయణ కథాసారమంజరి' కర్త 'క్షేమేంద్రుఁడు పశ్చిమ భారతీయ, బంగాళీ రామాయణ ప్రతుల నుపయోగించినట్లు, అతని విషయ సూచికయే తెలియపరచుచున్నది. ఈ శతాబ్దములో రామాయణ చంపూ లేఖకుఁడు విదర్భరాజు, ధారా నగరాధిపతి 'భోజుడు' బొంబాయి ప్రాంత సంస్కారణము నుపయోగించినట్లు తెలియుచున్నది. ఇందారుకాండ ములు మాత్రము కలవు. ఉత్తరకాండము జాడ కాన్పింపదు. మొత్తము 867 శ్లోకములు మాత్ర మున్నవి; కాని భోజుని కవిత్వము సుందరకాండాం తమువరకే, యని పండితులయూహ. ఇది భోజరచితమే కాదని, తరువాత ఎవరో సృష్టించిరని, 'కీత్' పండితుని విమర్శ. ఇందలి యుద్ధకాండము, మహారాష్ట్ర దేశ కవి 'లక్ష్మణకవి' విరచితమనుట తథ్యము. 'లేవి' అను విద్వాంసుఁడు పశ్చిమ భారతీయ (కాశ్మీర) శాఖయే ప్రాచీనతమ మనెను. వీనిలోని శ్లోకము లిట్లున్నవి.

1. కాశ్మీర ప్రతి.

2. వంగప్రతి—6 కాండములు—557 సర్గములు—19793 శ్లోకములు.

3. బొంబాయిప్రతి—7 కాండములు—650 సర్గలు—24528 శ్లోకములు.

దీనిలో నుత్తరకాండము కూడ కలదు. 'ఇటలీ'లోని సంస్కృత విద్వాంసుఁడు 'గారీసియో' (GOrresio) స్వదేశ భాషాను వాదసహిత ముగా 6 కాండములు ప్రచురించెను. ఇందు వాల్మీకి రచిత 'మూలరామాయ ణము'నకు ఏది సరిపోవునో నిర్ధారణ చేయుట కష్టతమము. కాని 'బొం బాయి' ప్రతి (మహారాష్ట్ర ప్రతి) మూల రామాయణమునకు సరిపోవు.

నట్లున్నదని 'స్మిత్' వ్రాసెను.[22] ఎట్లయినను, విద్వాంసులైన లేఖకులు వ్రాసిన చోట్ల, వ్రాతప్రతులకు తక్కువ అవసరముగలచోట్ల బెంగాలు మున్నగుచోట్ల, మూలరామాయణమును స్వేచ్ఛగా మార్చివేచిరి. ఉత్తరదేశమునం జమవుకొన్న లేఖకులు తక్కువగా వున్నచోట్ల మూలమున్నట్లుగానే ఉంచిరి. ఉత్తరకాండ సహితముగా రామాయణములో దాదాపు 25000 శ్లోకములున్నవి. ఇదియంతయు వాల్మీకి రచితమా ? కాదు. అనేక ఆవృత్తులను జెంది, వర్తమాన రామాయణ రూపములోనికిఁ జేరియున్నదని, 'వీబరు' పండితుడు వ్రాసెను. ఇది సత్యమే. పైనజెప్పిన మూడుప్రతులు గాక, 'వీబరు' పండితుఁడు, 'బెర్లిను' గ్రంథాలయమున నాల్గవప్రతి నొకదానిని గాంచెను.[23] భారతవర్షములో వేరువేరుచోట్ల లభ్యమైన రామాయణ వ్రాత ప్రతుల నవలోకించినచో, వాని భేదము లనంతములుగా నున్నవి. ఈ సంస్కరణములగూర్చి. ఎవరును మాటాడుటకు వీలులేనంత మార్పులతో గూడియున్నవి.[24] ఎవరి యిష్టానుసారము వారు, మూల రామాయణమును గలుషిత మొనర్చిరి.

1806, 1810 లో 'కారీ, మార్ష్‌మన్' అను 'సిరంపూరు' క్రైస్తవ మతాచార్యులు మూలమును ముద్రించి, రెండు కాండముల ననువదించిరి. వీరు ఉత్తరదేశ ప్రతి ననుకరించిరి. 20 ఏండ్ల తర్వాత 'ష్లెగల్' పండితుడు ఉత్తరదేశ ప్రతి ననుసరించి, రెండు కాండములను ముద్రించెను. ఇందులో నొకదానికి 'లాటిన్' భాషాంతరీ కరణము చేసెను. తరువాత 20 ఏండ్లకు ఇటలీ దేశ సంస్కృత విద్వాంసుఁడు, 'గొరిసియో' 'ఛార్లెసు అల్బర్టు' ద్రవ్యసహాయమున బెంగాలీ ప్రతి ననుసరించి, భాషాంతరీకరణము చేసెను. 'ష్లెగల్' అనువాదము పూర్తి కాలేదు. తరువాత అనేకమంది బొంబాయి, కలకత్తాలలో వ్యాఖ్యలతో సహా రామాయణమును ముద్రించిరి. కలకత్తాది 1917 నాటిది. 'గ్రిఫిత్' అనువాదము సర్వజనామోదముఁ బడసినది.

ఈ ప్రకారము 'మూలరామాయణము'లో ననేక దేశములలో ననేక ప్రక్షిప్త భాగములు చేయుటచేత, వాల్మీకి రచితమెంతవరకో తెలిసికొన వీలు లేకున్నది.

---

22 V. A Smith—Oxford history of India – P 27

23. A. Weber - The history of Indian literature P 193

24. M. M. Williams- Indian wisdom· P 336.

# ౩. రామాయణ రచనలో ఉద్దేశ్యము

మూల రామాయణములోని 5 కాండములలోని కథను రెండు పరిస్ఫుట విషయములుగా 'మాక్డ నాల్' మొదలగు విద్వాంసులు విభజించిరి. మొదటి అంశమునుబట్టి, అయోధ్యలోని దశరథ మహారాజు ఆస్థానమున జరిగిన సంఘటనముల వర్ణనము కలదు. కైకేయి తన కుమారుని సింహాసనమున కెక్కించు ప్రయత్నములు గలవు. దశరథుని మరణము, నగరమునకు భరతుని రాకతో రామాయణమును ముగించినచో, నది చారిత్రకమయ్యెడిదే. వాల్మీకి శ్లోకారంభము చేసిన కథ, దశరథుఁడు దేవాసురయుద్ధములో బాల్గొనుట, రథ చీల పోవుటచే కైకేయి సాయపడుట మున్నగునవన్ని చారిత్రకములే కావచ్చును; కాని అట్లుకాక కొన్ని అభూతకల్పనలు చేరినవి.

ఇక్ష్వాకు, దశరథ, రామ మొదలగు పేర్లు ఋగ్వేదములోఁగూడ నున్నవి. అచట వారికి ఒకరి కొకరి కెట్టి సంబంధమును లేదు. రామాయణములోని పైన దెల్పిన మొదటిభాగమునకు పౌరాణిక కథల కెట్టి సంబంధమును లేదు. మొదటిదానిలో మానవచరిత్రకు సంబంధించిన స్వాభావిక వర్ణనలు గలవు. రెండవ భాగమునుబట్టి స్వాభావికత కాన్పింపదు. ఇందు అస్వాభావికత, అసంగత, అద్భుత విషయములు గలవు. ఇవి చారిత్రకనులు కాఁజాలవు.

దక్షిణమున ఆర్యసామ్రాజ్య స్థాపనయే రామాయణోద్దేశ్యమని, 'లాసేను' పండితుఁడభిప్రాయ పడెను; కాని దక్షిణదేశములో రాముడు ఆర్య సామ్రాజ్యస్థాపనచేసి యుండలేదు. అట్టిస్థాపనా ప్రయత్నము కాని, ఉద్దేశ్యముకాని ఎచటను గాన్పింపదు. ఆర్యసభ్యతను దక్షిణమునకు, ముఖ్యముగా సింహళమునకు వ్యాప్తి చేయుటయే రామాయణోద్దేశ్యమని, 'వీబరు' పండితుఁడు వ్రాసెను.[25] ఇందలి పాత్రలు వాస్తవ

---

25 A. Weber—History of Indian literature P 192. Also R. K. Mukherjee—Hindu civilization P 142—"The Ramayana thus ultimately tells of the extension of Aryan civilization to the south as far as Lanka.

Rhys Davids—"A reference to a Prince extiled to the south and we may well believe that Rama was exisled to the south, as a matter of course."

మైన చారిత్రక పురుషులు కాని సీత యనగా నాగేటి చాలని, ఋక్కుల లోను గృహ్యాసూత్రములలోను, సీతను గూర్చిన సంబోధన మంత్రములు గలవని ముఖ్యపాత్ర రాముఁడు, బలరాముఁడని, హాలభృత్తని, తరువాత వీరు వేరు పాత్రలుగా మారిరని అబోరిజనులే రాక్షసులని, ఆర్య నాగరికత నంగీకరించినవారు వానరులని, 'వీబరు' వ్రాసెను.[26] ఇది యంతయు నలంకారిక వర్ణనయని 'వీబరు' చెప్పెను. కాని దీనికి దగు ప్రమాణములు లేవు. రాముని దండయాత్ర వలన నెచట దక్షిణమున నుండు ప్రజల సభ్యతపైన నెట్టిమార్పు కాని, అభివృద్ధిగాని కాన్పింపదు. అట్టిదేమైన నున్నచో నందందు ఋష్యాశ్రమముల ప్రశంశ కాక మరేమియు గాన్పింపదు. అదియును గాక, రాముడు విహరించెనని చెప్పఁబడిన ప్రదేశమంతయు నబోరిజనులచే నాసరింపఁ బడిన దండకారణ్య భూమిగాఁ గాన్పించు చున్నది.

జీవాత్మ పరమాత్మతో నైక్యానుసంధానము జెందు విధానము తెల్పుటే రామాయణోద్దేశ్యమని కొందరు వ్రాసిరి. ఈ ఆధ్యాత్మిక తత్వము మాకెందును తగులలేదు. సీతయన నాగేటిచాలు: వ్యవసాయ కళను దక్షిణ దేశమున ఆర్యుల ఆధిపత్యము క్రింద ప్రవేశ పెట్టుటయే రామాయణోద్దేశ్యమని ఆర్యుల దక్షిణదేశ దండయాత్రయని కొందరు వ్రాసిరి. దక్షిణ హిందూస్థానములోనికి 'ఆర్యులు' చొచ్చుకొని పోవుటే రామాయణ కథయని 'హుంటరు' వ్రాసెను. కాని యివి యన్నియు ఊహలే కాని సత్యమనుటకు ప్రమాణములు లభింపవు.

జర్మనీ విద్వాంసుడగు 'జాకోబి' మతము సరియైనదని పలువురు విద్వాంసులు అంగీకరించిరి. 'జాకోబి' యిట్లు వ్రాసెను. "ఇందలంకార మేమియు లేదు. రెండవ అంశమునకు గల్పనా బీజము, వేదములోనే కాన్పించు చున్నది. అందలి విషయమునే తీసికొని అసాధారణ మైనట్టి, అమానుష మైనట్టి కథగా వర్ణించడ మైనది. ఇది ఇంద్రవృత్రాసుర యుద్ధమే యిట్లు వర్ణింప బడినది.

సీత ఋగ్వేదములోని 'హలరేఖ'; ఆమెను శరీరముగల మూర్తిని వలె దేవివలె వర్ణించినారు. కొన్ని గృహ్యా సూత్రములలో నీమె భూమి దేవత

26. Ibid —P 192.

గాను సౌందర్యాధారిగాను, వర్ష దేవతయగు ఇంద్ర లేక పర్జన్యుని భార్యగాను వర్ణింపబడినది. రామాయణమునగూడ నీ యుత్పత్తి లక్షణములు గానవచ్చుచున్నవి. సీత, (I.66) తండ్రియైన జనకుడు భూమి దున్నుచుండగా, భూమిలో లభ్యమైనది; చివరి కామె భూమిలోనే యంతర్ధానమైనది. (VII.97) ఆమెభర్త రాముడు ఇంద్రుడే యగుచున్నాడు; వృత్రుడే రావణుడు; రావణునితో నతని యుద్ధము, ఋగ్వేదములోని, ఇంద్రవృత్ర కథయే యగుచున్నది. రావణుని కుమారుడు 'ఇంద్రజిత్తు' అను నామము దీనిని, మరింత బలపరచుచున్నది. ఇంద్రుని జయించినవాడు 'ఇంద్రశత్రు' అనగా 'ఇంద్రుని వైరి' యని తెలియును. ఋగ్వేదమునుబట్టి వృత్రుడు ఇంద్రుని వైరి యని తెలియును. రావణుని సీతాపహరణ వృత్తాంతములో దొంగిలింపబడిన గోవులు, ఇంద్రునిచే తిరిగి గైకొనబడుటను తెల్పును. కపివరుడైన హనుమంతుడు, సీతను దెచ్చుటలో సాయపడిన వాడు రాముని స్నేహితుడు; వాయుదేవుని సూనుడు. ఇతని పేరు మారుతి; ఇతడు యోజనము లెగురునని తెల్పబడినది. వృత్ర సంహారములో ఇంద్రుడు మరుత్తులతో స్నేహ మాచరించెనని, ఋగ్వేదమున నున్నది. శునకయైన 'సరమా' ఇంద్రుని దూతగా, 'రసా'ను దాటి ఆవులజాడ కనుగొనును. సీతపట్టు పడినప్పుడు సరమా రాక్షసి, ఆమె చెంతకేగి ఓదార్చును. హనుమంతుడు 'సంస్కృత పదము;' ఈయనకు గృషితో సంబంధము గలదు. ఋతుపవనము లెటింగినవాడు; కనుక ఈ సంబంధము సరిగా నున్నది; ఇంద్రుడు తన పిడుగుతో వృత్రుని సంహరించి, మేఘములనుండి వర్షము పడునట్లుచేసి, దున్నిన భూమిని సమృద్ధిగా పంటలు పండునట్లు చేసినాడు." రాముడే ఇంద్రుడని 'జాకోబి' అభిప్రాయము. అట్లైన రాముడు కల్పితపురుషుడా? ఈ విషయము జాకోబి తేల్ప లేకుండెను.

"సూర్య వంశ రాజులలో రాముని పేరు రామాయణములో నియ్యబడినది. 'వీబరు' పండితుడు రాముని పేరు రామచంద్రుడని ఒక్కచోట చంద్రుడని, కూడ ప్రయోగింపబడుట గుర్తించెను. 'తైత్తిరీయ బ్రాహ్మణము' లోని సీత చంద్రుని ప్రేమించిన కథయే, రామాయణ కథకు మూలాధారమై యుండునని, కొందరు విద్వాంసుల యభిప్రాయము. కాని ఈ యూహలాధార రహితములు.

సీత స్త్రీయోనినుండి కల్గలేదని, నాగేటి చాలునుండి కల్గినదని జనకుఁడు భూమి దున్ను చుండగా దొరకినదని వ్రాయఁబడుటచేత రాముని కథ 'దక్షిణ హిందూస్థానము'లో వ్యవసాయ ప్రవేశము జూపుచున్నదని సర్. యం. విలియమ్స్ వ్రాసెను.

"తైత్తిరీయ బ్రాహ్మణములో సీత (2-3-10, 1-3) సావిత్రి లేక ప్రజాపతి కుమార్తెగా వర్ణింప బడినది. ఆమె చంద్రుని ప్రేమించినను, చంద్రుడు శ్రద్ధయను మరియొక కుమార్తెను ప్రేమించి చివరకు మరల సీతనే ప్రేమించెను. (వాల్గవ ఋక్కు 57-6-7) అధర్వణ వేదము (11-3-12) సావిత్రి తన కుమార్తెయగు 'సూర్య'ను చంద్రుని కిచ్చెనను పూర్వగాథయే యిట్లు మార్పు జెందెను. ఇందుచేతనే రామచంద్రుడాయెను; అనగా చంద్రునివంటి రాముఁడని యర్థము; ఈ పేరే రామాయణ వీరుని కొసంగ బడెను.

పారస్కర గృహ్యసూత్రములలో (2-17-9) ఇంద్రుని భార్యగా సీత వర్ణింప బడెను. కానరామాయణములోని రాముఁడు ఋగ్వేదములోని ఇంద్రుడే. వేదములో 'ఉష' యను స్త్రీకి సూర్యుడు భర్తగాను, సోదరుడుగాను వర్ణింప బడినాడు. రామాయణములోని సీతకు రాముఁడు భర్తగాను, దశరథ జాతకములో సీతకు సోదరుఁడుగాను, వర్ణింపఁబడి యుండెను. వేదములో వర్ణింపఁ బడిన రూపకాలంకారములను ప్రకృతి వర్ణనలను సృష్టి చమత్కారములను, పౌరాణిక రచయితలు కల్పిత గాథలుగా తయారు చేసిరి. అట్లనే 'వాల్మీకి' వేదములోని ఇంద్ర వృత్రాసుర యుద్ధమును రామరావణ యుద్ధముగాఁ దయారు చేసెను. ఇట్లు 'విలియమ్స్' అభిప్రాయ పడెను. పేర్ల సామ్యమునుబట్టి ప్రతి విషయము నూహించుటకు వీలులేదు. ఇక్ష్వాకు రాజవంశము మిథ్యయా? రాముడు కల్పిత పురుషుడా? ఈ విషయములను వీరు తేల్చియుండలేదు. అందుచే వీరి ఊహాయంతయు సత్యమని నమ్మఁజాలను.

రామాయణములో రాముని 'ఆర్యపుత్ర' యని సంబోధించుట పలు తావులలో జరిగినది. 'ఆర్య' యనగా వ్యవసాయము చేయువాడని యర్థము. ఆర్య శబ్దము వ్యవసాయము చేయుట అను అర్థమిచ్చు ధాతువు నుండియే కల్గినది, అని మోక్షముల్లరు, దత్తు, పండిత ప్రసన్న కుమార ఆచార్య

మున్నగు విద్వాంసులు వ్రాసిరి. ప్రసన్న కుమార యిట్లు వ్రాసెను. 'కృషి యన సేద్యము చేయుట. ఈ అర్థమిచ్చు ధాతువునుండి అర్యశబ్దము కల్గినది.'

ఆర్యుల పూర్వ నివాసములలో 'తురేనియనులకు' వీరికి భేదము తెలియ పరచుటకే పదము వాడబడినది. ఋగ్వేదములో ఆర్యునికి నాగలితో దున్నుట, పైరువేయుట బోధించి ఆహారము పండుటకొరకు వర్షములిచ్చి, దస్యులను పిడుగులతో నాశనము జేయవలసినదని, అశ్వినీదేవతలను ప్రార్థించిన మంత్రములు గలవు. (1—17—21) ఇట్లనే భాగ్యశాలివియగు సీతా! (నాగేటిచాలా!) ముందుకు నడుపుము. మేము నీకు వందనము చేయుదుము. నీవు మాకు ఎక్కువగా బంటయు, ధనంబు నొసంగుము." ఇంద్రుడు సీతను గ్రహించుగాక! ఇత్యాది సంబోధనములలో సీత, ఇంద్రుల పేర్లుకలవు. ఆర్యుల ముఖ్యవృత్తియగు వ్యవసాయమును, దక్షిణహిందూస్థానములో లంకవరకు ప్రవేశపెట్టుటయే రామాయణ కథకు మూలమని, ఇంద్రుడే రాముడని, నాగేటిచాలే సీతయని, రాముడు ఆర్యపుత్రుడుగా వర్ణింపఁ బడెనని, వ్యవసాయ విద్యను ప్రవేశపెట్టుటచేత నట్లు వర్ణించిరని, కొందరు వ్రాసిరి; కాని ఈ యూహసత్యము కాదు. ఆర్య యనగా పూజ్యుడైన విద్వాంసుడని, ఈశ్వర పుత్రుడని అర్థమున్నను, ఈ యర్థములో నిట వాడఁ బడలేదు. సీత అయోనిజ; భూమిలోబుట్టి భూమిలో గలసిపోయినదని రామాయణము తెల్పును. రాముడు కాని, లక్ష్మణుడు కాని భూమి దున్నుచు పోయిన ఆధారములు లేవు. అందుచేత వ్యవసాయము ప్రవేశ పెట్టెనని చెప్పుట సబబుగాలేదు.

'స్మిత్' ఈలాగున వ్రాసెను. "భక్తి రూపమైన గాధగాను, విష్ణు వవతరించెనని చెప్పుటకే వీరగాధ బ్రాహ్మణులచేత కూర్పఁబడినది. ... సీత యనగా నాగేటి చాలు; ఇంద్రుని పేరు, రాముని పేరు సమానార్థకములు. ఇది నిజమైనను, గాకపోయినను, రామాయణములోని విషయములు, వాస్తవముగా జరిగిన చారిత్రాత్మక విషయములు కావు; ఇందులోని సంగతులు 'అయోధ్యలోగాని, మరియొక దేశములోగాని జరిగినవి కావని, నా యభిప్రాయము. కోసల, అయోధ్యాదుల గల్పించి, ఊహాగ్రంథముగా రామాయణము రచింపఁ బడెనని నాయూహ. అందుచే రాముని కాలనిర్ణయము చేయుటకూడ, ఊహయేకాని, నా మనసుకు సంతృప్తికరముగా లేదు." [27]

---

27. V. A. Smith - Oxford history of India. P 32

ఇందలి రాముడు, అయోధ్య, కోసల మున్నగు పేర్లు కల్పితములుఁ కాజాలవు. అవతార కథనము బౌద్ధమతోదయము తర్వాత కల్గినది; వాల్మీకి కాలమునాటికీ యూహా కాన్పింపదు. రామకథ యంతయు కల్పితమనుటకు వీలులేదు. అందుచేత స్మిత్ ఊహాలు తప్పనవచ్చును. జాకోబి, మాక్డనాలు పండితులిట్లు వ్రాసిరని 'స్మిత్' వ్రాసెను. "రామాయణము చారిత్రాత్మకము కాదు; రూపకాలంకారయుక్తమును కాదు. వాల్మీకి కవికృతమగు ఊహాకల్పితమైన పురాణగాథ. వాల్మీకిచే తన కవితాచమత్కృతిని ప్రదర్శించుటకు వ్రాయఁబడిన కావ్యము.[28]" (2-6 కాండములు)

కాని రామాయణములోఁ గొన్ని చారిత్రాంశములు గాన్పించుచున్నవి. అందుచే సమగ్రము పురాణగాథ యనుటకు వీలు కాన్పింపదు.

రామేశచంద్ర దత్తు ఈ లాగున వ్రాసెను. "సీతయనగా నాగేటిచాలు; దక్షిణహిందూస్థానములో గ్రమముగా వ్యవసాయము ప్రాకుటచేత, ఒక రాజకీయ కల్పిత కథను, సీతను దక్షిణమునకు గొనిపోయిరని కల్పించుట కష్టము కాదు. ఈమె పవిత్రమైన, జ్ఞానియైన విదేహరాజగు జనకుని కుమార్తెగా, సహజముగా వర్ణింపబడెను. ఇతిహాసములో సీత భర్తయని కోసలరాజని వర్ణింపబడిన రాముఁడెవరు? పురాణము లాయనను విష్ణువుయొక్క అవతారమని చెప్పినవి; కాని మనము మాటాడు కాలము నాటికి, విష్ణువు ఉన్నతస్థితికి రాలేదు. ఇతిహాసయుగములో నింద్రుఁడింకను దేవతలలో ముఖ్యుడుగా నుండెను. సూత్రవాఙ్మయములో సీత నాగేటి చాలని, ఇంద్రుని భార్యయని యున్నది. అపుడు రాముఁడు భారతములోనిఁ అర్జునునివలె, ఇంద్రుని పేరేనా? ఇంద్రుని పేరు కల్పితముగా ఉత్తర హిందూస్థానములోని చారిత్రాత్మక యుద్ధములోను, దక్షిణ హిందూస్థానములోని చారిత్రాత్మక దండయాత్రలోను వర్ణింపఁబడినది. రామాయణము పూర్తిగా చారిత్రాత్మకముగా నిరుపయోగమైనను, మహాభారతమువలె భరతవర్షములోని పురాతన సంఘజ్ఞానమును దెలియఁజేయును. ఈ రెండు మంత్రములలో నాగేటిచాలు సీత - స్త్రీగా సంబోధింపఁబడి, సమృద్ధిగా పంటనిచ్చుటకు ప్రార్థించబడినది. యజుర్వేదములోగూడ నాగేటిచాలు అట్లనే పూజింపఁబడినది. ఆర్యులు హిందూదేశ మంతయు

28 Ibid:—

క్రమముగా జయించినప్పుడు, ఆదిమ కాంతారములు, ఖాళీభూములు, నాగేటిచాలులో గుర్తింపఁబడినప్పుడు, సీత యను నాగేటిచాలు విస్పష్టమైన మనుష్య రూపము దాల్చినది; ఇదియే ఆర్యుల దక్షిణ హిందూస్థానమును జయించిన విధమును వర్ణించు ఇతిహాసములో వీరపత్ని యైనది.... మహాభారతమువలె, రామాయణము చారిత్రాత్మక సంఘటనములకు పూర్తిగా విలువ లేనిది; మహాభారతములోవలెనే, రామాయణములోగూడ వీరులు కవి కల్పితములు.' [29] కాని దత్తు వ్రాతలు సత్యములు కావు. రామాయణ కాలమున ఆర్యులు దక్షిణమున వ్యవసాయమును ప్రవేశ పెట్టియుండలేదు. సీత జ్ఞానియైన జనకుని కుమార్తెకాదు. ఆమె రామాయణ ప్రకారము శీరధ్వజజనకుని కుమార్తె. వీరులు కవి కల్పితములుకారు. కొందరు చారిత్రక పురుషులున్నారు. కాన దత్తు వ్రాతలు పూర్తిగా సత్యములు కాఁజాలవు.

డాక్టరు స్మిట్జ్ ఈలాగున వ్రాసినాడు.

"రాముడు తొమ్మిదవ యవతారము; రాముని చర్యలు రామాయణములో నద్భుత కృత్యములుగా వర్ణింపఁ బడినవి. దీని చారిత్రక మూలమేమనగా బహుశా దక్షిణమునకు రాజ్యము విస్తరించుటకు ఆర్యుని ప్రథమ ప్రయత్నముగా నున్నది". కాని ఆ కాలమున రాజ్య విస్తీర్ణత కాన్పింపదు.

కె. వి. రంగస్వామి అయ్యంగారు యిట్లు వ్రాసిరి. 'ఈ కాలములో విద్వాంసులు రామాయణమును గొన్ని పురాతన వేద గాథలను కావ్య రూపముగాఁ జేసియైనను లేక ఆర్యులచేతఁ జరుపఁ బడిన దక్షిణ హిందూస్థానపు ప్రసిద్ధమైన దండయాత్రయని కాని గుర్తించు చున్నారు'. [30] రామాయణ మంతయు వేదగాథలనుండి కల్గినదికాదు; సత్యమైన చారిత్రకాంశములు కొన్ని లభించుచున్నవి.

సి. యస్. శ్రీనివాసాచారి, యం. యస్. రామస్వామిగారిట్లు వ్రాసిరి. "ఏమాత్రము రామాయణ భారతములు చారిత్రాత్మకములు, కావు; అనిశ్చితమైన ఐతిహ్యములమీద నాధారపడి యున్నవి. రామాయణము ముఖ్యముగా నూహాకల్పిత గ్రంథము.... క్రీ.పూ. 1000 నాటి ప్రజల జీవి

29 R. C. Dutt—Ancient Hindu civilization P. 35
30 K. V. Rangaswamy—A history of Ancient India. P 17,

తము, ఆచారముల చరిత్రను దెలియపరచుట కుపయోగించుచున్నది; కొందరు విద్వాంసులు ఈ యితిహాసోద్దేశ్యము, దక్షిణ హిందూస్థానపు ఆర్యుల దండయాత్ర మహిమను స్తుతించుటయేయని తలంచుచున్నారు."[31] గ్రంథమంతయు నూహాకల్పిత గ్రంథము కాదు. దండయాత్రయని చెప్పుటకు వీలులేదు; ఏలనన రామాయణములోఁ జేర్కొనఁబడ్డ దేశము లాకాలమున లేవు; ఉన్నను ఆర్యులకుఁ దెలిసియున్న వనుటకు ఆధారములు లేవు.

వింధ్యను దాటిపోవుట, గోదావరి ప్రాంతపు జనస్థానమును జేర్కొనుట చూడగా, ఆర్యుల దక్షిణ హిందూస్థాన ప్రవేశము కాన్పించుచున్నదని కొందరు వ్రాసిరి; తిలక్ యిట్లు వ్రాసెను "రామాయణము కల్పితము; రామాయణ రచయిత వైదిక గాథలలోని కొన్ని విషయములు గైకొని మూలములోని, ఐతిహాసిక సంబంధముగా నున్న ముఖ్యాంశములతో గలిపి, ఈ రామాయణ కథ నల్లెనని తెలియుచున్నది. ——సీతయనగా నాగేటి చాలు; ఋగ్వేదములో నీయర్థముగల మంత్రము గలదు. ఓ సీతా! భక్తునిపై సర్వసంపదల ననుగ్రహింపుము. ఋగ్వేదములోఁ జెప్పఁబడిన ఈ నాగేటి చాలే (సీత) రామాయణములో భూమిలోని నాగేటిచాలుగా మారినది. సీత భూమిలోనేపుట్టి, రాముఁడు చూచుచుండగానే, భూమిలోనే కలసి పోయినది. ఋగ్వేదములోని సీత——వీనిని దీసికొని, కొన్నిటిని స్వీయ ముగా జేర్చి క్రొత్తకథనల్లి, వాల్మీకి రామాయణముగాను, 'హోమరు' అను గ్రీకు కవి, 'ఇలియడు' కథగాను వ్రాసిరి. ఉపారూపియగు భార్య మరల తన భర్తను బొందుటయను సృష్టి చమత్కారమును, వాల్మీకిరామా ణముగాను, హోమరు 'ఇలియడు' గాను వ్రాసిరేకాని, ఇది వాస్తవముగాఁ జరుగలేదు.[32]" ఇంకను 'తిలక్' పది తలలుగల దశముఖుని గూర్చి విమ ర్శించుచు, రామాణములోని కథ, ఇంద్రవృత్రాసురులకు సంబంధించినదని, హోమరును జూచి రామాయణము వ్రాసెనను మాట అర్థరహితమని, ఉభ యులకు మూల మొకే పురాణ గాథ యనికూడ వ్రాసెను. తిలక్ గారి యూహ చాలవరకు సత్యముగానే కాన్పించుచున్నది.

---

31. C. S. Srinivasachari and M. S Ramaswamy-Ayyangar - Hindu India P 31.

32 B. G. Tilak—The Arcitic home in the Vedas P 347—348—349.

'టాల్బాయిస్ హీలర్' రామాయణగాథ, బ్రాహ్మణులకు సింహళద్వీప బౌద్ధులకు గల విరోధము, శత్రు భావము సూచించుటకు సృష్టింపఁబడిన దని, బౌద్ధులనే రాక్షసులుగా వర్ణించిరనికూడ, అభిప్రాయమొసంగెను; కాని ఈ యూహతప్పనుట నిశ్చయము. మూలరామాయణ రచనా కాలము నాటికి బౌద్ధమతమే లేదు. అనార్యులను రాక్షసులుగా వర్ణించిరి కాని, బౌద్ధులను కాదు. సింహళములో బౌద్ధమతవ్యాప్తి క్రీ. పూ. ౩ వ శతాబ్దములోగాని జరిగియుండలేదు. అట్లయిన రామాయణ రచనము క్రీ. పూ. ౩ వ శతాబ్దికి పరమేయగుచున్నది; కాని మొత్తము రామాయణ మంతయు నొకేసారి రచింపఁబడినదను 'హీలరు' ఊహ చారిత్రకసత్యము కాఁజాలదు. శైలిని, భాషనుబట్టి బాలకాండ, ఉత్తరకాండ, రాముని విష్ణువుగా వర్ణించిన భాగములు ప్రక్షిప్తములని అందరంగీకరించినదే, కాన 'హీలరు' భావము సరికాదు.

ఈ ప్రకారమనేక మంది విద్వాంసుల యభిప్రాయముల గమనించితిమి. రామాయణములోని కథ కొంత చారిత్రక సత్యముగా నున్నది; మిగత భాగము వేదగాథలను కావ్యరూపముగాఁ జేసినట్లు కాన్పించుచున్నది. జాకోబి, తిలక్ మున్నగు విద్వాంసుల ఊహలు సత్యములుగాఁ గాన్పించు చున్నవి.

---

## ౬. రామాయణ రచనాకాల నిర్ణయము - వివిధ పండితుల అభిప్రాయములు

రామాయణ రచయిత వాల్మీకి క్రీ. పూ. 14 వ శతాబ్ద ప్రాంతపు వాఁడని నేను వెనుకనే వ్రాసితిని. మూలరామాయణ మప్పటిదేయై యుండ వలయును; కాని వర్తమాన రామాయణ రచనా కాలమందరికి సందేహ ముగా నున్నది. 'వీబరు' పండితుఁడు మహాభారతము తరువాతదని, క్రీ. శ. 3–4 శతాబ్దములలో రామాయణ రచన జరిగెనని వ్రాసెను. 'విలియమ్సు' క్రీ. పూ. 5 వ శతాబ్దములో రామాయణ రచన జరిగి యుండెనని, అభిప్రాయ మొసంగుచు నీ క్రింది కారణముల నొసంగెను.

1. రామాయణములో సతి ఆచారము కాన్పింపదు; మహాభారతములోని పాండురాజు సతి మాద్రి, వసుదేవుని భార్యలు, కృష్ణుని భార్యలు సహగమనము చేసిరి. కాని యుద్ధములో హతమైన వీరుల భార్య లెవరును సహగమనము చేయలేదు. దీనినిబట్టి ఈ సతిప్రథ పంజాబు దగ్గర పశ్చిమోత్తరములో నపుడే యారంభ మగుచున్నట్లు తోచు చున్నది. రామాయణ రచనా కాలమునాటి కది ప్రాగ్దేశముల కెక్కి యుండలేదు; ఈ ఆచారము క్రీ. పూ. 300 నాటికిగలదని, మగధకు తూర్పు ప్రాంతము వరకు కలదను 'మెగస్థనీసు' వ్రాతలబట్టి, రామాయణ మహాభారతములు క్రీ. పూ. 300 కు పూర్వము రచింపబడి యుండవలయును.

2. రామాయణ, భారత రచనలు బౌద్ధమతోదయమునకు బూర్వపువి. ఒక్క చోట మాత్రమే రామాయణములో బుద్ధుని, బౌద్ధమతము పేరు కాన్పించును. బుద్ధుఁడిచ్చట చోరుఁడుగాఁ బోల్చఁబడెను. ఇది ప్రక్షిప్త శ్లోకము. ఇట్టి శ్లోకము మూలభారతములోఁ గూడలేదు. ఇట్టి దూషణ, బౌద్ధమత ఖండనము మున్నగునవి క్రీ. పూ. 500 కు తర్వాతనే బయలుదేరెను.

3. అశోక శాసనములబట్టి క్రీ. పూ. 3-వ శతాబ్దములో హిందూస్థానము లోని మామూలు జనులభాష, పరిశుద్ధమైన సంస్కృతము కాదని తెలియును. అది ప్రాకృతభాష. ఇవి క్రీ. పూ. 3-వ శతాబ్దినాటి వైనచో, 'మృచ్ఛకటికము' మున్నగు గ్రంథములోవలెనే ప్రాకృత భాషలోని మాటలు, సంభాషణలు కాన్పించి యుండెడివే. అట్లు కాక ఇందు సంస్కృతమే కాన్పించుచున్నది; కాన ప్రాకృతభాషలో జనులు మాటాడుట ఆరంభింపక పూర్వము, ఈ గ్రంథరచన జరిగి యుండవలయును.

4. ఇవి వ్రాయబడు కాలమునకుముందు, దక్కను, భారతవర్షములోని పశ్చిమ, దక్షిణభాగములు, ఆర్యులచే నాక్రమింపబడలేదు; కాని అశోకుని శాసనములఁబట్టి, క్రీ. పూ. 3వ శతాబ్దములో మగధ, పాట్నా రాజుల రాజ్యములు వివిధ దేశములలో ప్రసరించినట్లు, పంజాబు ఘూర్జర, ఢిల్లి కటక్ లలోని శాసనములవలన నెరుంగవచ్చును.

5. ఒకటవ శతాబ్దములోఁ బుట్టినవాఁడు, ట్రాజన్ చక్రవర్తిచే నాదరింపఁబడినవాఁడు, అయిన గ్రీకులేఖకుఁడు 'డయన్ క్రిసోస్టోమస్' (జననము క్రీ. పూ. 50) హోమరునుండి అనువాదము చేసినట్టి లేకచూచి వ్రాసికొన్నట్టి ఇతిహాసములు భారతీయులచే వల్లింపఁబడు చుండెనని వ్రాసెను. ఈవిషయములు 'లాసేను' పండితుఁడు చెప్పినట్లుగా, 'మెగస్తనీసు' వ్రాతలనుండి కైకొనియుండవచ్చును. క్రీ. పూ. 3 లేక 4వ శతాబ్దములో 'ఇలియడ్'ను బోలినపద్యములు, భారత వర్షములో వ్యాప్తిలోనున్నట్లు తెలిసికొనవచ్చును. హిందూకవులు 'హోమరు' నుండి ఏయొక్క భాగమునుగూడ కైకొనియుండలేదు. ఈకారణమున నిది క్రీ. పూ. 500 ప్రాంతమున రచింపఁబడి యుండవలయును"[33] ఈయూహలు చాలవరకు సత్యముగానే యున్నవి.

'వింటర్ నిట్జ్' అను పండితుఁడు మూలరామాయణము క్రీ. పూ. 3వ శతాబ్దములో ప్రాచీన గేయముల ననుసరించి రచింపఁ బడెనని వర్తమాన రామాయణమున కిప్పటి రూపు క్రీ. శ. 2వ శతాబ్దము నాటికిఁ గల్గినదని అశ్వఘోషుని బుద్ధ చరిత్ర, రామాయణము ననుసరించి వ్రాయఁబడిన గ్రంథము అని చెప్పుచు నీక్రింది కారణముల నొసంగెను.[34]

1. కుమారలత 'కల్పనామండిటీక' క్రీ. శ. 2వ శతాబ్దాంతములో వ్రాయఁబడెను. ఈతడు రామాయణమును పేర్కొనెను.

2. క్రీ. శ. 3వ శతాబ్దములో చైనీయ భాషలో రామకథ బుద్ధ కథగా మార్చి వ్రాయఁబడినది.

3. క్రీ. శ. 4వ శతాబ్దములోని 'వసుబంధుని' కాలమున రామాయణము ప్రచారములో నున్నది.

4. క్రీ. శ. 4వ శతాబ్ద ఉత్తరార్థములో జైనగురువు 'విమల సూరి' రామ కథను ప్రాకృత కావ్యమగు 'పద్మ చరిత్రము'గా వ్రాసెను.

5. క్రీ. శ. 600లో రామాయణము 'కాంబోడియా'లో ప్రసిద్ధిఁ జెందెను. ఒక శాసనములో 'సోమశర్మ' యను బ్రాహ్మణుఁడు రామా

33. M.M, Williams-Indian wisdom P 312, 313 and 314
34. M. winternitz—A historyof Indian literature Vol I P 513.

యణము పురాణము సంపూర్ణ భారతము నొక దేవాలయమున కొసం గెనని యున్నది.

ఈ తఁడిచ్చిన మూల రామాయణ రచనాకాలము తప్పు; వర్తమాన రామాయణము క్రీ. శ. 2వ శతాబ్దినాటికి పూర్తియైనదను విషయము సందేహాస్పదము.

'మాక్డనాలు' పండితుఁడు, మూలరామాయణము, మహాభారతమునకు పూర్వపుదని, క్రీ. పూ. 5 వ శతాబ్దమునకు పూర్వపు రచనయే యని, తరువాత ప్రక్షిప్త భాగములన్ని క్రీ. పూ 2 వ శతాబ్దమున కిటీవలి రచనలని యభిప్రాయ మొసంగెను. ఆతడు చూపించిన కారణము లివి :

1. మూలరామాయణము మహాభారతరచనకు బూర్వపుది. భారత వీరులు రామాయణములోఁ బేర్కొనబడలేదు; కాని రామాయణములోని పాత్రలింకను పేర్కొనఁబడినారు. మహాభారతములోని 7 వ పర్వములో రామాయణము యుద్ధకాండలోని రెండు పంక్తులు, వాల్మీకిరచితములు పేర్కొనఁబడినవి; కనుక రామాయణము మహాభారతమునకంటె పూర్వపుదగుట నిశ్చయము. వనపర్వములో 277–291 ఆశ్వాసములలో 'రామోపాఖ్యానము' కలదు. ఇది రామాయణము ననుసరించియే వ్రాయఁబడినది. 'వాల్మీకి' శ్లోకములతో ననేకము లిందలివి సరిపోవుచున్నవి. ఈ కవి బొంబాయిప్రాంతరామాయణము ననుసరించిన జాడలు కాన్పించుచున్నవి.

2. జాతకకథలలో దశరథజాతకములో రామాయణకథ కాన్పించుచున్నది. రామాయణములోని ఒక శ్లోకము (VI-128) కూడ నిందు కాన్పించుచున్నవి. లౌకిక సంస్కృతశ్లోకము లంతకు పూర్వపువే యగుచున్నవి. పాళీరచనలు లౌకిక సంస్కృత శ్లోకముల నియమముల ననుసరించుచున్నవి. రామాయణములో నొకచోటమాత్రము బుద్ధుని పేరుకలదు. ఆ శ్లోకము ప్రక్షిప్తము; కనుక రామాయణము బౌద్ధ వాఙ్మయమునకు పూర్వగ్రంథమే యగుచున్నది.

3. రామాయణకర్త యవనుల నెరుంగునా? అను విషయ మాలోచింప వలయును. యవనులను రెండుసార్లు మాత్రము కవి పేర్కొనినాడు. 1-వ, 4-వ కాండములలో యవనుల పేరుకలదు. 'జాకోబి' యివి

ప్రక్షిప్తములనెను. దీనినిబట్టి, మూలరామాయణమునకుఁ జేర్పఁబడిన ప్రక్షిప్తభాగములు, క్రీ. పూ. 300 లకు తర్వాతనే కూర్పఁబడినవని యెరుంగవచ్చును. రామాయణములో గ్రీకుల ప్రభావముగలదని చెప్పు 'వీబరు' మాటలు సత్యములుకావు. సీతయొక్క అపహరణమునకు, లంకపై దండయాత్రకు, 'హెలెన్'ను చెరపట్టుటకు ట్రోజన్ యుద్ధమున కెట్టి వాస్తవిక సాదృశ్యమును లేదు. రాముఁడు సీతను వివాహమాడుముందు శివధనస్సును వంచెను. ఈ కథకు 'యులీసస్' విక్రమగాథలకు సామ్యములేదు. గ్రీకులకే కాకుండ, ఇతరులకు కూడ నిట్టి కథలు గలవు. అవి ఆయా దేశములలో స్వతంత్రముగా నావిర్భవించినవే.

4. రామాయణములోఁ బూర్వ భారతవర్ష రాజనైతిక వ్యవస్థ వ్యక్తమగుచున్నది. ఇందు పాటలీపుత్ర నగరము పేరలేదు. ఈనగరము రాజగు 'కాలాశోకునిచేత' స్థాపింప బడినది. క్రీ. పూ. 380లో 'వైశాలీ నగరము'లో రెండవ బౌద్ధసభ ఈరాజు ఎదుటనే జరిగెను. 'మెగస్థనీసు' (క్రీ. పూ. 300) కాలమున నది 'హిందూస్థానము' నకు రాజధాని యాయెను. ఆనగర మేర్పడిన ప్రదేశము మీదగా రాముఁడు వెళ్ళినట్లు బాలకాండము 35వ సర్గ తెల్పుచున్నది. కౌశాంబి, కన్యాకుబ్జ, కాంపిల్య మున్నగు పూర్వభారతములోని అనేక నగరముల స్థాపనను గూర్చి ప్రస్తావన కలదు. 'కోసల'కు వెలుపల నెంత దూరము వరకు రామాయణఖ్యాతి వ్యాప్తియైనదో ఈ విషయము తెల్పును. అప్పటికి పాటలీ పుత్రమున్నచో తప్పక కవి పేర్కొని యుండెడి వాడే.

5. మూలరామాయణములోఁ బ్రతిచోట 'అయోధ్య' యని పిల్చుచుండిరి. బౌద్ధులు, జైనులు, గ్రీకులు, పాతంజలి మున్నగువారు దీనిని 'సాకేత' యనిరి; కాని రామాయణము అంతిమ కాండములో రాముని కుమారుడు 'లవుడు' శ్రావస్తిలో దన ప్రభుత్వమును స్థాపించెనని యున్నది. ఇది మూలరామాయణములో నెచటనులేదు. బుద్ధుని కాలములో, కోసలరాజు 'ప్రసేనజిత్తు' శ్రావస్తిలో రాజ్యపాలన చేసెను. దీనినిబట్టి, మూలరామాయణ రచన, ప్రాచీన అయోధ్యానగరము వీడక పూర్వము, కోసలకింకను రాజధానిగా నున్నపుడు, దాని నూత్న

నామము ‘సాకేత’ తెలియనప్పుడు, శ్రావస్తి కింకను ప్రభుత్వము మార్చని కాలమందును, జరిగియుండెనని స్పష్టపడుచున్నది.

6. బాలకాండ, ప్రథమసర్గనుబట్టి, మిథిల, వైశాలీ నగరములు రెండు కవలనగరములవలె వర్ణింపబడినవని తెలియును. అవి వేరువేరు రాజుల క్రిందనున్నవి. బుద్ధునికాలము నాటికి, ఒకే నగరమగు ‘వైశాలీ’గా కలసికొనిపోయి, కొందరు పెద్దమనుష్యులతోఁగూడి చేయు రాజ్యాధిపత్యము క్రిందను లేక పంచాయితీ క్రిందను వచ్చెను.

రామాయణములో వర్ణింపబడిన రాజనైతిక వ్యవస్థల వర్ణనలనుబట్టి, ఆకాలమున చిన్నచిన్న మాండలికరాజు లుండిరని, వారి రాజసీమ లతిసంకుచితములని, అవి ఎన్నడు గొప్పరాజ్యములు కావని, తెలియుచున్నది. వీనికి విరుద్ధముగా, మహాభారతములో, జరాసంధుడనురాజు క్రింద, మగధయేకాక అనేకప్రదేశములు సమ్మిళితములైయున్నట్లు దెలియుచున్నది. వీనిని బట్టి క్రీ. పూ. 400 నాటి అనేక రాజకీయ విభాగములగూర్చిన విషయములు దెలియుచున్నవి. పైన చెప్పబడిన యుక్తుల ననుసరించి, మూలరామాయణము క్రీ. పూ. 500 కు పూర్వపుదేయని, ప్రక్షిప్తభాగములు క్రీ. పూ. 2-వ శతాబ్దమున, తర్వాతను జేర్పబడినవని స్పష్టపడుచున్నది.

ఈ అనుమానము ‘రామాయణము’లోని భాషాసంబంధమగు సాక్ష్యముపై దృష్టి పరపినచో, తేలదు; ఏలనన, బొంబాయి ప్రాంతీయశాఖ రామాయణములోని భాషను, తరువాతభాషలో నెట్లు వికాసితఅవస్థ ప్రకటితమగుచున్నది కాన్పించును. ఇది ‘పాణిని’ అనంతరమే కాన్పించుచున్నది. ఈ వైయాకరణి, ఈభాషాభేదమును గమనించియుండలేదు. దీనినిబట్టి రామాయణము పాణినికి తరువాత రచన కానేరదు; ఏలననగా పాణిని. శిష్టులయొక్క సంస్కృతభాషనుగూర్చి ఆలోచించి యుండెను. అది వైతాళికుల యొక్క లోకోచితమైన భాషకంటె ఎక్కువ ప్రాచీన మగుట సహజము. దీనిని ఉపేక్షించుట వారి సహజగుణము: అశోకుని శిలాలేఖనముల కాలము, పాణినికి అర్థశతాబ్దము తర్వాత రామాయణము పుట్టిన ప్రదేశములోని ప్రజల భాష, ప్రాకృతము. ప్రజారంజకము కొరకు రచింపఁబడిన రామాయణము ప్రజల కర్థము చేసికొనలేని సమయమున రచింపఁబడుట అసంభవము. ఒకవేళ రామా

యణములోని భాష పాణినికి తరువాత భాషయని ఒప్పు కున్నచో, అది అప్పటి ప్రబల ప్రభావమునుండి ఏవిధముగా దప్పించుకొని పోయినదో తోచకున్నది. ఇతి హాసములలోని లౌకిక సంస్కృతము వాల్మీకి రచనా కాలమునాటికి పూర్వమే వ్యాప్తి జెందుట సంభవమే. మహాకావ్యము లను బరిశోధించినచో వానికి ప్రాచీన వీర కావ్యముల భాషకు చాల దగ్గర సంబంధ మున్నదని తెలియుచున్నది. అవి 'పాణిని' నియమములను బూర్తిగా ఉల్లంఘించినవి." [35]

ఈ కారణములన్ని చారిత్రక సత్యములని, హేతుయుక్తములని చెప్ప వచ్చును. కాని రామాయణ రచనాకాలమును, 'మాక్డనాలు' తేల్చ లేకుండెను. 'హంటరు' రామాయణములోని కొన్ని ముఖ్య భాగములు మహా భారతము కంటె పురాతనమైనవని, రచన మొత్తముగా జూచిన, చాల తరువాత కాలమునకు జెంది యున్నదని, క్రైస్తుకు ఎన్నో శతాబ్దములు పూర్వముకాదని, రామాయణకథ క్రీ. పూ. 1000 నాటిదని, వ్రాసెను.[36] తన ఊహలకు 'హంటరు' కారణముల నొసంగలేదు.

కీత్ పండితుడిట్లు వ్రాసెను. "ప్రక్షిప్తభాగములు క్రీ. పూ. 2 వ శతాబ్ద మునకు దర్వాతనే కలుపబడినవి; వాల్మీకి, అతని అనంతరము రామాయణ మును వృద్ధి జేసిన కవులు, క్రీ. పూ. 400—200 మధ్యకాలములోని వారు."[37] వాల్మీకి కాలము తప్పనుట నిశ్చయము.

'జాకోబి' యను విద్వాంసుడు, క్రీ. పూ. 8—6 శతాబ్దముల మధ్య ఎపుడో, రామాయణరచనయని, వ్రాసెను. ఈతడు 'వాల్మీకి' కాలనిర్ణయ మును జేయజాలక పోయినాడు.

'భారతవర్షీయ కాల నిర్ణయము,' అను గ్రంథలేఖకుడు, రాముడు రావణుని 42 వ ఏట చంపెనని, లంకాయుద్ధము క్రీ. పూ. 1450 అని, ఋగ్వేదకాలములోని వారగు 'దివోదాను,' దశరథులు అనార్యులతో యుద్ధమాడినది క్రీ. పూ. 1500 లోనని వ్రాసెను.[38] కాని ఇది తప్పుగానున్నది.

35 A. A. Macdonall-A history of Sanskrit literature P 307—310.

36 Hunter—A Brief history of Indians P 60.

37 A. B. Keith-A history of Sanskrit literature P 42.

38 S. N. Pradhana—Chronology of Ancient India P 175.

'స్వామి కణ్ణు పిళ్ళే' రాముని జాతక చక్రమును బట్టి రాముఁడు క్రీ. పూ. 2055లోని వాఁడని వ్రాసెను. కాని జాతక చక్రమే కల్పితముగా నున్నది. రామునికి ఉచ్చ జాతక మివ్వవలెనను దృష్టితో క్రైస్తవ శకారంభమునాటి జ్యోతిష్కు డెవరో ఈ శ్లోకమును జేర్చుట తథ్యము. రామాయణము నాంగ్లేయ భాషలోనికి మార్చిన 'గ్రిఫితు' రామాయణోత్పత్తి క్రీ. పూ. 12వ శతాబ్దమున జరిగియుండ వచ్చు నని వ్రాసెను.[39] కాని 541వ పుటలో ఋగ్వేద కాలమునకు, రామాయణ కాలమునకు మధ్య భాషాభేదమును బట్టి చాలకాలము గడచి యుండునని అభిప్రాయ మొసంగెను. కాని ఈయూహ తప్పని నా యభిప్రాయము.

'సర్ విలియమ్ జోన్సు' అను న్యాయాధీశుడు 22 భాషలలో పండితుఁడు. రాముఁడు క్రీ. పూ. 2039లో నుండెననెను; కాని యిది ఆధార రహితము. టాడ్ క్రీ. పూ. 1100లోనని, బెంట్లి క్రీ పూ. 950లోనని, 'గరిసియో' అను ఇటలీ కవి, క్రీ. పూ. 13వ శతాబ్దములో నని వ్రాసిరి. రాముని సమకాలీనుఁడగు 'వాల్మీకి' అపుడుండుటచేత రామాయణ రచన, ఆ కాలముననే జరిగినదని వారి అభిప్రాయము; కాని కారణముల నొసంగ లేదు.

'సి. వి. వైద్యా రామాయణమును గూర్చి, వర్తమాన రామాయణము మహాభారత రచనకుఁ దర్వాతదని క్రీ. పూ. 2వ శతాబ్దమునకు తరువాత రచనయని చెప్పుచు నీ క్రింది కారణముల నొసంగెను.

1. వర్తమాన రామాయణములో శ్రమణుల, శ్రమణికలయొక్క పేర్లు గలవు. (I–14–12–II) బౌద్ధ మతోదయము తర్వాతిదే రచన యగుచున్నది. అదియునుగాక బుద్ధుని పేరు, బుద్ధుని దూషణ కూడ కలవు.
2. వర్తమాన రూపములో రామాయణము క్రీ. పూ. 1వ శతాబ్దమునకు బూర్వము కాఁజాలదు.

---

39 T, H. Griffith—The Ramayana of Valmiki P 564 But as far as regards the epic Poem properly so called which celebrates the expedition of Rama against the Rakshasas, I think that I have sufficiently shown that origin and first appearance should be placed about the 12th century B. C.

3. ప్రస్తుత రామాయణములో రాసుల పేర్లు కలవు. దీనిని బట్టి క్రీ. పూ. 1వ శతాబ్దమునకు బూర్వపుది కాదు. ఈ కాలము వరకు హిందూ దేశములోని ఆర్యులు యజ్ఞయాగాది కర్మకాండ చంద్రుడు డా యానక్ష త్రములలో గలసి యున్నప్పుడు చూచి, జరుపు కొనుచుండిరి. వాస్తవ ముగా ఆర్యుల జ్యోతిషము, ఫలశాస్త్రము కేవలము సూర్యుని చుట్టు తిరుగు భూమార్గము, 27 నక్షత్రములుగా విభజింపఁబడు నట్టి పద్ధతి మీద ఆధారపడి యుండెను. వారికి లగ్నముల గూర్చి కాని, రాశి చక్రమును గూర్చి కాని, రాసుల జ్ఞానమును గూర్చి కాని తెలియదు. ఈ జ్ఞానము భారతీయులకు, క్రీ. పూ. 200 వ సంవత్సర ప్రాంతములో 'యవనుల' వలన కలిగినది. అంతకు పూర్వ మీ జ్ఞానము లేదు. అశోక మహారాజు కాలమునాటి, బౌద్ధుల శాస్త్ర ములుకూడ నక్షత్రములఁ బట్టియే, శుభాశుభ సమయముల దెల్పుకొను చుండెను. రాముని జన్మదిన శుభలగ్నము రామాయణములోఁ ద్వైవిధ ముగా నున్నది.

3. ఉత్తరకాండము 36 వ సర్గలో వ్యాకరణ వేత్తలగు గ్రంథకర్తలందరి పేర్లు కలవు. 'బృహత్కథా సరిత్సాగరము'ను బట్టి చంద్రగుప్త, నందుల రాజ్య కాలములో 'వ్యాడి' నివసించెను. ఈతఁడు 'వరరుచి' గురువు, వర్తమాన రామాయణములో 'పాతంజలి మహాభాష్యము' యొక్క పేరుకూడ కలదు. 'పాతంజలి' తన మహాభాష్యములో, క్రీ. పూ. 150 లోని 'మీనాండరు'ను, సాకేతాదులను బేర్కొనెను; కాన 'మీనాం డరు'కు తర్వాతదే రామాయణమని తేలుచున్నది. ఈ విధముగా అనేక కారణములనుబట్టి వర్తమాన రామాయణ రచన క్రీ. పూ. రెండవ శతాబ్దమునకు దర్వాతనే జరిగినదనుట స్పష్టము. మహాభారత రచన, 'అలెగ్జాండరు' దండయాత్ర తర్వాతనే జరిగినది; ఏలనన దీనిలో 'యవనుల' ప్రశంశకలదు.

**శ్లో॥ నశశాకవశేయం పాండురపివీర్యవాన్**
**సోఽర్జునేనవశం నీతోరాజాసీద్, యవనాధిపః**

తా॥ పాండురాజు పరాక్రమవంతుడైనను, వానిని జయింపలేకపోయెను కాని అట్టి యవనాధిపుడు, అర్జునుని చేత నిర్జింపబడెను.

అలెగ్జాండరు దండయాత్రభయ మింకను, ఆఖరు మహాభారత లేఖకుని కాలము నాటికి, ప్రజలమనసులలోఁ దగ్గలేదు. మహాభారతములో రాశి చారలేదు; కాని క్రీ. పూ. 200 నాటికి రాశిజ్ఞానముకలిగినది ; కనుక ఈ కాలమునకు బూర్వము, మహాభారత రచనజరిగినది; కాని ఈ నాటి రామాయణము, మహాభారతమునుండి కొంతభాగమును సంగ్రహించినది. ఒక ఆశ్వాసమంతయు, ముక్కకుముక్క అందులోనేయున్నది. మహాభారతములోనిది, క్రమమైన సందర్భములో నున్నను, రామాయణములోమాత్రమది అసందర్భముగా నున్నది; ప్రక్షిప్తమైయున్నది. 'అయోధ్యాకాండము' లోని 100 వ సర్గ సభాపర్వములోని 5-వ ఆశ్వాసము ఒక్కటియే. ఇందు రాజధర్మములు, ఉత్తమ ప్రభుత్వమునకు గావలసిన సాధనములగూర్చి వ్రాయబడియున్నది.

4. వసుదేవుని పేరు రెండుచోట్ల వర్తమాన రామాయణములోగలదు; దీని రచన ఎపుడో క్రీ. పూ. 1-వ శతాబ్దములో నగుట నిశ్చయము.

5. బుద్ధుని శిష్యులు, అవతారములను, పూర్వజన్మలనుగూర్చి వ్రాయుచుండ, పూర్వాచార పరాయణులగు ఆర్యులు, గొప్పసంకటములోఁ బడిరి. వారుకూడ అవతారాదుల బ్రవేశపెట్టిరి. ఇంకను, రాముని కాలమున, గోదావరికి దక్షిణమున ఆర్యుల వలసరాజ్యములు లేవు; పాండ్యులను బేర్కొనుట చూడగా, నొక కాలములో జరిగిన విషయమును, ప్రమాదవశాత్తు, మరియొక కాలమున జరిగెనని చెప్పుట జరిగినది. యవనులకాలమున 'పాండ్యులు' బాగుగా విఖ్యాతిగాంచిరి. అందుచేత క్రీ. పూ. 1-వ శతాబ్ద ప్రాంతమునాటి 'రామాయణ రచయిత', వారిని బేర్కొనుటలో నాశ్చర్యములేదు. [40]

ఇంకను 'వైద్యా' ప్రస్తుత మహాభారత, రామాయణములు, ఇతిహాసము నుండి వచ్చినవని, వేదాంగకాలముననున్న వ్యాసరచితమగు ఒక పురాణము నుండియే, 18 పురాణములు కల్గినవని, పాణిని పేర్కొన్న 'రామోఖ్యానము' ఋషి వాల్మీకి రచితమని క్రీ. పూ. 100 నాటి, పేరుతెలియని నేర్పరియైన ఒక ప్రసిద్ధకవిచే తిరిగి చెప్పఁబడెనని వర్తమాన రామాయణముగా

40 C. V. Vaidya—The riddle of the Ramayana P.5, 20, 21, 22, 24, 25, and 40.

సది తయారుచేయఁబడెనని, 'సంస్కృత సాహిత్యచరిత్ర'లో వ్రాసెను.[41] కాని ఆధారములు లేవు.

'హాప్‌కిన్సు' అను అమెరికా సంస్కృత విద్వాంసుఁడు, రామాయణ మహాభారతముల దగ్గరనుంచుకొని, రెంటిని సమగ్రముగాఁ బరిశీలించి, రెంటిలోని సమానశ్లోకములనెత్తి వ్రాసికొని, రెంటిభాష ఇంచుమించు సమానముగా నుండెనని, చాలశ్లోకము లొకదానితో నొకటి, పోలియుండుటచేత, రెండు నొకేకాలమునకుఁ జెందియుండవచ్చునని, వ్రాసెను. 'భాండార్కరు' బాలకాండములోని 'దీనారములు' మున్నగుపదముల వాడుకనుబట్టి, ఈ కాండము చాల తరువాత కాలములోనిదనెను.

జాతకకథలు త్రిపిటకములో నొకభాగము; అశోకునికిఁ బూర్వమే వ్రాయఁబడినదని చరిత్రకారులు వ్రాసిరి. బౌద్ధ కథలలో, దశరథజాతకములో శ్రీరాముఁడు దయార్ద్రహృదయుఁడని, అహింసావ్రతధారియని, పరోపకారియని, సీత రాముని సోదరియని కలదు. కొన్నిపదములు తు, చ తప్పకుండ ప్రస్తుత రామాయణముననున్నవి. రామాయణకథ మార్పులతో నుండుటచేత, జాతక కథలనాటి రచనయని కొందరు విద్వాంసులు వ్రాసిరి. రామాయణ, మహాభారతములు, జాతకకథలు, ఇంచుమించు సమకాలీనములే యని, 'వింటర్‌నిట్జ్' కూడ యభిప్రాయపడెను. కాని మూలరామాయణమునకు, వర్తమాన రామాయణమునకు గలభేదముల వీరుగుర్తింపరైరి.

క్రీ. పూ. 4-వ శతాబ్దికిఁ బూర్వమే 'మూలరామాయణ రచన జరిగెనని,' 'జయచంద్ర విద్యాలంకారు' వ్రాసెను. 'హేమచంద్రరాయ్ చౌదరి', రామాయణములోని అధికభాగములు ధీశాలురైన విమర్శకుల అభిప్రాయములలో నది, బింబిసారుని రాజ్యపాలనకు, (క్రీ. పూ. 519 - 491 కొందరు క్రీ. పూ. 582 - 554) దర్వాతకాలమునఁ గూర్పఁబడినవని, వ్రాసెను. 'మూలరామాయణము' (2-6 కాండములు) ఒక్కదినములో జదువుటకు వీలుగానుండెనని, తరువాత ప్రక్షిప్తభాగము లనేకములు చేరినవని, లక్ష్మణరాయధీమణి వ్రాసెను. రామాయణములో నేయేభాగములు చారిత్రకమైనవో చెప్పుట కష్టమని, 'దత్తుపండితుఁడు' వ్రాసెను.

41. C. V. Vaidya—History of Sanskrit literature P. 2-IV

'నగేంద్రనాథఘోషు', ఇతిహాసములలోని భాగము లనేక ఆవృత్తులను జెంది, వేరువేరు కాలములలో ననేక భాగములు జేర్పఁబడినవని, వర్తమాన రామాయణము క్రీ. శ. 200 ప్రాంతపుదని, మహాభారతము క్రీ. శ. 400 నాటిదని, మూలరామాయణము క్రీ. పూ. 200 నాటిదని, భారతము క్రీ. పూ. 400 నాటిదని, అందలి ఇతిహాసము మాత్రము, రచనకంటె చాల పూర్వపుదని, యజ్ఞయాగాది సమయములలోను, గొప్పవిందుల సమయము లోను, గాయకులు కథలుగాను, వీరకావ్యముగాను పాడుచుండెడి వారని, యితిహాసముల మూల మిదియేయని, లిఖించినాడు. కురుక్షేత్రయుద్ధము క్రీ. పూ. 1000 నాటిదని ఈ విద్వాంసుడు వ్రాసెను. 'మెహతా' తన 'ప్రాగ్బౌద్ధిక భారతవర్షము'లో నీయుద్ధము క్రీ. పూ. 12 వ శతాబ్దిలో జరిగెననెను.

ఇట్లు పలువురు విద్వాంసులు భిన్నభిన్న విధముల రామాయణ, భారత కాలములఁ గూర్చి వ్రాసిరి. వీనినిబట్టి క్రీ. పూ. 14 వ శతాబ్దమునుండి, క్రీ. శ. 200 వరకు రామాయణ రచన జరుగుచునే యుండెనని, తేలు చున్నది; ఈ యూహలు సత్యముగానే కాన్పించుచున్నవి.

---

# ౭. సత్యాన్వేషణ

రామాయణ రచనా కాలమును ఆంతరిక, బాహ్యాధారములచేత నిర్ణ యింపవలయును. నే నీ క్రింది విధముగా కాలనిర్ణయమును జేయుచున్నాను.

1. 'పతంజలి' తన 'మహాభాష్యము'లో రామాయణమును ప్రశంసించెను. పతంజలి క్రీ. పూ. 150 వ సంవత్సర ప్రాంతపు వాఁడని, విద్వాంసు లనేకులంగీకరించిరి. ఈ కాలమునాటి యవనుల దండయాత్రనుగూడ ఇతడు వర్ణించెను. 'రామకృష్ణ గోపాల భాండార్కరు' అను ప్రసిద్ధ చరిత్రకారుఁడు 1872 అక్టోబరులో 'ఇండియన్ ఆంటిక్వేరీ'లో వ్రాయుచు, 'పుష్యమిత్రశుంగుఁడు' 'పాటలీపుత్రము'లో రాజ్యమేలు కాలమున 'పతంజలి' యుండెనని, ఆతడు భాష్యము 3 వ అధ్యాయ

మును. క్రీ. పూ. 144—142 ల మధ్య వ్రాసెననెను.[42] మాక్డనాలు తన భారతవర్ష ప్రాచీన వైభవము అను గ్రంథమున 'పాతంజలి' కాలము క్రీ. పూ. 150 అనెను. 'గోల్డుస్ట్రికర్' పతంజలి కాలము క్రీ. పూ. 140 — 120 మధ్యఅనెను. 'లాసేన్' పతంజలికాలము క్రీ. పూ. 2వశతాబ్దమనెను. 'వీబరు' పతంజలి కాలము క్రీ. పూ. 25 అనెను కాని, అది ఆధారరహితము.

పతంజలికృత మహాభాష్యములో 1 పుష్యమిత్రయజయామ 2 అరుణాద్యవనసాకేతం, అనగా సాకేత నగరమును 'మినాండరు' పట్టుకొనుట అని యుండుటచేత పతంజలి క్రీ. పూ. 150లోని వాండనుట నిశ్చయము. కనుక క్రీస్తుకు రెండు శతాబ్దములకుఁ బూర్వము రామాయణము వ్యాప్తిలోఁగల దనుట కాధారములు గలవు. కాని అది మూల రామాయణమో, వర్తమాన రామాయణమో తెలియకున్నది. బహుశా మూలరామాయణము కావచ్చును.

2. రామరూపముగా భగవంతుఁ డవతరించెనని చెప్పుటకీ వీరగాథ తరువాత కాలములోని మరియొక కవిచేత వర్తమాన రామాయణముగా తయారు చేయఁబడినది. బౌద్ధుల నుండి అనేక విషయములను గ్రహించి హిందువులు తమ మతములోఁ జేర్చుకొనిరి. పూజావిధానము అవతార కథనము, తీర్థయాత్రలు, దేవాలయ నిర్మాణము ఉత్సవములు, విగ్రహారాధనలు, మున్నగున వన్నియు హిందువులు బౌద్ధుల నుండియే కైకొనిరి. బౌద్ధులు, బుద్ధుని ధర్మమును, సంఘమును నమ్మి భిక్షువులగుచుండిరి. హిందువులు వీని ననుసరించి, బ్రహ్మ విష్ణు,

---

42 Ind, Ant, Voi I—P 299, Vol II—P 69.

Also R. G. Bhandarkar—A peep into early history of India (1930) P 20 "Pushyamitra is several times alluded to by Pantanjali in the 'Mahabhashya' and from the occurence of his name, in a particular passage I have fixed Patanjali's date to be about' 142 B. C. 'Arunad yavanah Saketam,' Arunad yavana Madhyamikam." Here Patanjali uses an imperfect phrase."

Also A. A. Macdonall—India's past P 138.

శివులను, త్రిమూర్తులను బూజింపసాగిరి.[43] వేదకాలమున దేవాలయములు, విగ్రహపూజ, అవతార కథనము, మున్నగునవి లేవు. "మెగస్థనీసు (క్రీ. పూ. 302) వచ్చునాటికి, హిందువులు వేరువేరు మూర్తుల నవతార పురుషులుగాఁ బూజించుచుండిరి. అవతారకథనము, బౌద్ధమతోదయము తర్వాతనే, బౌద్ధులవలన నావిర్భవించినది. బుద్ధుని శిష్యులు, అవతారముల, పూర్వజన్మల, జాతక కథలనమ్ముచుండిరి; కాని క్రీ. పూ. 500 సంవత్సర ప్రాంతమునకు తర్వాతనే రామాయణ రచన జరిగియుండ వలయును.

౭. బుద్ధుని తర్వాతనే రామాయణము సంస్కరింపఁ బడినది. రాముఁడు జాబాలితో మాటాడు సందర్భమున అయోధ్యా కాండను (109–34లో) నిట్లు కలదు.

శ్లో॥ యథాహిచోర స్య తథాహి బుద్ధః
తథాగతం నాస్తిక మత్రవిద్ధి
తస్మాద్ధి యశ్శంక్య తమః ప్రజానాం
ననాస్తికే నాభిముఖో బుధస్స్యాత్॥

తా. దొంగనెట్లు నిరాకరింప వలయునో అట్లనే బుద్ధుని నిరాకరింప వలయును. నాస్తికుని తథాగతునితో సమానుఁడని గ్రహింప వలయును. కనుక ఎవనిని ప్రజలు నాస్తికుఁడని సందేహించుచుందురో వానితో పండితులు పల్కరాదు.

ఈ విధముగా బుద్ధుని దూషణ కలదు.[44] "హేమచంద్ర రాయ్ చౌదరి ఈ శ్లోకము వంగశాఖీయమగు పశ్చిమోత్తర రామాయణములో లేదని వ్రాసెను. అనేక ప్రతులలో నీ శ్లోక మున్నది. కాని బౌద్ధమతోదయమైన తర్వాతనే మూలరామాయణము సంస్కరింపఁ బడియుండుట తథ్యము.

---

43 R. C. Dutt—Ancient India (1913) P 132.
Ibid—P 152.

44 C. V. Vaidya—The riddle of the Ramayana P 20
There is a direct reference to *B*uddha himself and it contains a downright condemnation of him.

౪. రామాయణములో 'కారకకల్పములు', అయోధ్యలో మిగుల గౌరవింపఁబడుచుండెనని, (10—6) వ్రాయఁబడినది. 'కారక సంహిత'లో ధృతరాష్ట్ర, విచిత్రవీర్యుల పేర్లుకూడ కలవు. కఠ కాలాపుల, తైత్తిరీయాచార్యుల, గౌరవింపుమను వచనము, సౌమిత్రితో మాటాడు సందర్భములోఁ గలదు. ఈ కఠుఁడు, కాలాపుఁడు వైశంపాయనుని శిష్యులని, పతంజలికృత మహాభాష్యములోను, పురాణములలోను, బ్రాహ్మణములలోను గలదు. వైశంపాయనుఁడు, యాజ్ఞవల్క్యుని మేనమామ; రామాయణము అయోధ్యాకాండము 32 లో కఠ, కాలాప, తిత్తిరిమున్నగు విద్వాంసుల పేర్లుగలవు. మహాభారతము సభాపర్వము 4—24 ను బట్టి, యుధిష్ఠిరుని దివ్యసభా ప్రవేశోత్సవ సమయములో, కఠ కాలాపు లచట విద్వాంసులై యుండిరని తెలియును. మహాభాష్యములో

శ్లో॥ గ్రామే గ్రామే కాఠకం కాలాపకంచ ప్రోచ్యతే ॥

అని కలదు.

వైశంపాయనుఁడు, జనమేజయునికి వ్యాసాజ్ఞచేత సర్ప యజ్ఞానంతరము, భారతకథను వినిపించెను. జనమేజయుఁడు, తనయజ్ఞమునకు వాజసనేయులఁ బిలిపించెను. 'వైశంపాయనుఁడు' దీనినిసహింపలేక శాపము పెట్టెను. 'జనమేజయుఁడు' నాశనమాయెను. ఇతని రెండవపేరు 'చరకుఁడు' పాణిని 4—3—104లో 'చరక ఇతి వైశంపాయనస్యాఖ్యా' అనెను. వైశంపాయనునికి యాజ్ఞవల్క్యుఁడు మేనల్లుఁడు; శిష్యుఁడు. శాంతిపర్వము 344—9ని బట్టి తిత్తిరి (తైత్తిరి) వైశంపాయనుని పెద్ద అన్న యని తెలియును. ఈయనకు ౮౬ శాఖలు కృష్ణయజుర్వేదము తెలియును; 9మంది శిష్యులు గలరు. చరకుల ఖండనము, బృహదారణ్యకములో గాన్పించు చున్నది. యుధిష్ఠిరుని సభకు 'తిత్తిరి' కూడ వచ్చెను. యాజ్ఞవల్క్యుని శిష్యుఁడగు 'వాత్స్య' కూడ జనమేజయుని సర్పయాగమునకు వచ్చినట్లు మహాభారతము ఆదిపర్వమునుబట్టి తెలియును. వీనిని బట్టి వీరెల్లరు కొంచె మించుమించు సమకాలీనులు; భారత కాలములోనివారు. మహాభారత యుద్ధము క్రీ. పూ. 950 ప్రాంతమున జరిగినట్లు మాకనేక నిదర్శనములు గలవు; కాన కఠ కాలాపులు క్రీ. పూ. 10వ శతాబ్ద ప్రాంతమువారు; వీరికి తర్వాతనే వర్తమాన రామాయణ రచన జరిగినది.

5. వేదముల తర్వాత బ్రాహ్మణములు బయలు దేరినవి. 'ఐతరేయ బ్రాహ్మణము'లో ఆంధ్రులు, పుండ్రులు, శబరులు, పుళిందులు, మూత బులు, విశ్వామిత్రుని సంతతులని ఆర్యుల సరిహద్దులలో వసింపకుండ, విశ్వామిత్రుఁడు వారిని శపించెనని యున్నది. ఆ కాలములోని ఆర్యు లకు, పుళింద, శబరులను వింధ్యారణ్య శాఖలు మాత్రము తెలియును. ఈ బ్రాహ్మణకాలము క్రీ. పూ. 7 లేక 8 వ శతాబ్దమని, 'హాగ్' పండితుఁడు వ్రాసెను. బ్రాహ్మణముల కాలము క్రీ. పూ. 800_600 మధ్యయని, మోక్షముల్లరు, మెక్డనాలు, కీత్, వింటర్ నిట్జ్, మున్నగు బహు విద్వాంసుల యభిప్రాయములతో మేము ఏకీభవింప వలసివచ్చి నది. ఇది ఋగ్వేదీయ బ్రాహ్మణము. ఇందు శ్వేతకేతువు, ఆరుణి పేర్లు కాన్పింపవు; కాని 6_30 లో 'బులిల అశ్వతరాశ్వి' పేరు కలదు; ఛాందోగ్యము 5—11 ను బట్టి, ఈతఁడు 'ఉద్దాలక ఆరుణి' సమకాలీనుఁడని తెలియుచున్నది. 'జైమినీయ బ్రాహ్మణము'ను బట్టి 'బులిల అశ్వతరాశ్వి' ఆరుణి సమకాలీనులని తేలుచున్నది. 'బులిల అశ్వతరాశ్వి'కి జనకుని సభలో సంవాదము కూడా జరిగెను. 'ఉద్దాలక ఆరుణి' ఐదుగురు జిజ్ఞాసువులఁ దోడ్కొని, మహా రాజగు అశ్వపతి చెంతకుఁ బోయెను. (కైకేయ ఛాం. ఉ. 5_1_1_4) 'ఉద్దాలక ఆరుణి' గురువు 'అయోధ ధౌమ్యుడు' పరీ క్షిత్తు కాలములోని వారు. అయోధ ధౌమ్యుని తండ్రి పాండవ పురో హితుడు, ధౌమ్యుడు. పాండవులు క్రీ. పూ. 950 వ సంవత్సర ప్రాంత మున నుండిరి. 'బులిల' ఆశ్వతరాశ్వి' ఆరుణి, సమకాలీనులగుట చేత, క్రీ. పూ. 850వ సంవత్సర ప్రాంతమున జీవించి యుండుట నిక్కువము. కాన 'బులిల అశ్వతరాశ్వి'ని పేర్కొన్న 'ఐతరేయ బ్రాహ్మణము క్రీ. పూ. 850 తర్వాతదేయగుట నిశ్చయము. కాన బ్రాహ్మణముల కాలము పాశ్చాత్య విద్వాంసుల యభిప్రాయాను సారము సరిగానే యున్నది. ఎట్లయిన ఈ బ్రాహ్మణ కాలమునాటికి ఆర్యులు దక్షిణదేశ మెరుఁగరు.

రామాయణములో నత్యంత దక్షిణ ప్రదేశములగు పంపాసరస్సు, కిష్కింధ, శంబరా పురము, లంక మున్నగునవి వర్ణింపఁ బడినవి. ఆర్యులకు దక్కనును గూర్చి క్రీస్తుకు 7 శతాబ్దములకు బూర్వము తెలియదని వింధ్య

దక్షిణ భూభాగములకు వారు చేరలేదని కె. వి. రంగస్వామి, ఆర్. జి. భాండార్కారు మున్నగు విద్వాంసులు వ్రాసిరి. ఆర్యులు తూర్పుదిశగా వచ్చి, విదర్భ కళింగల నాక్రమించిరని, తరువాత వింధ్యదాటి దండకారణ్యములో ప్రవేశించిరని, గోదావరి యొడ్డున 'మహారాష్ట్ర'ములో నివసించిరని క్రీ. పూ. 350 నాటికి తంజావూరు, మధురల నెరింగిరని, భాండార్కారు మున్నగు చరిత్ర కారులు వ్రాసిరి.[45]

క్రీస్తు పూర్వము 5వ శతాబ్ద ప్రాంతపు వాఁడగు 'బోధాయనుఁడు' తన సూత్రములలో 'కళింగ'ను పేర్కొనెను. క్రీ. పూ. 350 నాటి వాఁడగు శాలాతురవాసి 'పాణిని' కళింగను, పాండ్య, చేర, చోళ రాజ్యములను పేర్కొనెను. క్రీ. పూ. 302లో చంద్రగుప్తుని కాలమున పాటలీ పుత్రమునకు వచ్చిన యవన రాయబారి 'మెగస్థనీసు' భారతవర్షములోని 118 రాజ్యములను, 'తాంబ్రేపేను' వరకుఁ బేర్కొనెను. క్రీ. పూ. 3వ శతాబ్ది లోని వాడగు 'అశోక మహారాజు' శిలాశాసనములందు వీని పేర్లు గలవు. అశోకుఁడు, మహేంద్రుని, సంఘమిత్రను, బౌద్ధమత ప్రచారార్థము సింహళమునకుఁ బంపెను. మౌర్యరాజ్యపాలన దాదాపు మదరాసు వరకుఁ గలదు. పాణిని వ్యాకరణముపై వార్తికము వ్రాసిన 'కాత్యాయనుడు' (క్రీ. పూ. 250) పాండ్య, చోళుల, నాసిక్య నగరములఁ బేర్కొనెను. క్రీ. పూ. 29లో 'భద్రబాహుఁడను జైనయతి క్షామసమయములో దక్షిణ దేశ మేగెను. పతంజలి (క్రీ. పూ. 150) మాహిష్మతి, విదర్భ, కేరళ, కాంచీపురము, మున్నగు దక్షిణప్రదేశములఁ బేర్కొనెను. రామాయణ కర్త వర్ణించిన ప్రదేశముల బట్టి, రాముని మార్గము 'లంక' వరకుఁ దెలియుచున్నది.

'వింటర్‌నిట్జ్' అను జర్మనీ పండితుఁడు ఆర్యుల దండయాత్ర క్రీ. పూ. 7 లేక 8 వ శతాబ్దములలోఁ దప్పక జరిగియుండ వలెనని, 'బుహ్లారు' ఆర్యుల దక్షిణ హిందూస్థాన దండయాత్ర క్రీ. పూ. 700 లేక 600 లో జరిగి యుండెనని వ్రాసిరి; కాని 'అగస్త్యుడు' మున్నగువారు క్రీ. పూ. 14 వ శతాబ్ద ప్రాంతమున నున్నవారని, వారు వింధ్య, విదర్భల దాటివచ్చి ఆశ్రమ మేర్పరచు కొనిరని, వారికి అత్యంత దక్షిణప్రాంతములు

---

45 R. G. Bhandarkar— Bombay Gazetteer Vol 1 Part II P 141

తెలియవని మా యభిప్రాయము. ఏవిధముగాఁ జూచిన, క్రీస్తుకు ఏడు శతాబ్దములకుఁ బూర్వము, ఆర్యులకు దక్షిణ హిందూస్థానమును గూర్చి తెలియదు. క్రీ. పూ. 350 నాటికి లంకవరకుఁగల అన్ని రాజ్యముల నార్యు లెరింగిరి. ఈ మధ్య కాలములోనో తర్వాతనో రామాయణ రచన జరిగియుండ వలయును. లేనిచో రామాయణ కర్త మాత్రము, క్రీస్తుకు 7 శతాబ్దములకుఁ బూర్వము,ఆర్యులు దక్షిణా పథము రాకుండనే, దక్షిణ దేశ రాజ్యముల నెట్లెరుంగును ?

13/138

6. ఆర్యులు మూడుమార్గములలో దక్షిణ హిందూస్థానమునకుఁ జేరియుండిరి. అవంతిగుండ, నర్మద వింధ్యలమీదుగా విదర్భలోనికిఁజేరి, అచట నుండి గోదావరి పైభాగమునకుఁజేరు మార్గమొకటి. 'అగస్త్యుడు' ద్వారకచేరి, వచ్చిన దక్షిణాపథమిదియే; రెండవది తూర్పు సముద్ర తీరముగఁ బోయినది; మూడవది సముద్రమార్గము.

నేలమార్గముగఁబోయిన మొదటి ఆర్యుఁడు 'అగస్త్యుఁడు.' సముద్ర మార్గమునబోయిన మొదటి ఆర్యుఁడు 'విజయుఁడు.' సింహళ దేశచరిత్ర యగు 'మహావంశము' షష్ఠ, సప్తమ పరిచ్ఛేదములనుబట్టి, 'విజయుని' యాత్రా వృత్తాంతము దెలియుచున్నది. 'సింహబాహు' అను రాజునకు 'విజయుఁ'డను కుమారుఁడు కల్గెను. విజయుఁడతి క్రూరుఁడు,' ప్రజల మాటలను విని, తండ్రి యతనిని దేశమునుండి వెడలఁగొట్టించెను; 700 అనుచరులతో నావ నెక్కించి, అతనిని సముద్రములో వదలిరి; ఆనావ, 'కొంకణము'లోని 'శూర్పరక' నామక నగరము, (సోపారా) చేరెను. అచటి జనులాతనికి స్వాగత మొసంగిరి; అచటినుండి నావ లంకకుఁ జేరెను. ఆసమయమున, 'బుద్ధభగవానుఁడు' కుశనగరములో నిర్వాణ ప్రాప్తి పొందుటకు, రెండుసాల వృక్షముల మధ్య పరుండి, తనను జూడ వచ్చిన ఇంద్రాదులతో నిట్లు వచించెను. "లాట దేశరాజు సింహబాహు కుమారుఁడు 'విజయుఁడు' 700 మంది అనుచరులతో, లంకకుఁ జేరినాడు; దేవేంద్రా! లంకలో నా ధర్మమును స్థాపన చేయును. ఇందు కొరకు మీరు, విజయుని, అతని అనుయాయులను, లంకను రక్షణ చేయుడు."

అంతట 'దేవేంద్రుఁడు', లంక యొక్క రక్షణ భారమంతయు, 'విష్ణువు' అను దేవత కప్పగించెను. ఆ దేవత వెంటనే లంకకేగి, సన్యాసి

వేషంబు దాల్చి, యొక వృక్షంబు క్రింద కూర్చుండెను. విజయుండు, అతని అనుచరులు నా దేవత చెంతకేగి, ఈ ద్వీప మెవరిదని యడిగిరి. ఆ దేవత, అది లంకాద్వీపమని, అందెవ్వరు మనుష్యులు లేరని' మీకెందు భయము లేదని'' చెప్పెను. ఈ మాటలు పల్కుచు గగన మార్గమున నా దేవత ఎగిరి పోయెను [46].

తరువాత 'యక్షిణి' కాన్పించినది; 'యక్షిణి'తో మాటాడు నపుడు, ఆ నగరము 'సిరీస వృద్ధుని' నగరమని, యక్షిణి చెప్పినది. 'విజయుడు' అచట ఉండు యక్షరాజ వంశమును, యక్షులను నిర్మూలనము జేసెను. దీనిని బట్టి 'లంకాద్వీపము'లో విజయుని రాకకు పూర్వము మనుష్యులే లేరని, యక్షులు మాత్రము కలరని, స్పష్టపడుచున్నది. ఆర్యశాఖకు చెందిన రావణుడు కాని, అతని తండ్రి కాని, లంకకుఁజేరి, రాచరికము జేసిరనుట కాధారములు లభింపవు. మహావంశమున వీరి ప్రస్తావనయే లేదు.

'విజయుఁడు' యక్షరాజ కుమారికువేణిని వివాహముఁ జేసికొనెను. కాని యామెను తరువాత వదలివేసెను. పిమ్మట 'మధురలోని పాండ్య రాజకుమార్తెను పెండ్లాడెను. తామ్రపర్ణి నగరమును నిర్మించి 38 ఏండ్లు రాజ్యమేలెను.

విజయుని తమ్ముడు 'అనూరాధుడు' అనురాధపురమును గట్టించెను. ఈ జనులందరు 'సింహపురము' నుండి వచ్చుటచేత, ఈద్వీపముయొక్క పేరు కూడ'సింహళము' అయినది. ఇప్పటికి అదియే పేరు, కాని రామాయణ కర్తకు సింహళమను పేరు తెలియదు. అన్నిచోట్ల, 'లంక' యనియేవాడెను. దీపవంశ, మహావంశములనుబట్టి, విజయుఁడు వచ్చినప్పుడు, రాజకుమారుఁడు, తనఅరచేతిని, దలక్రిందఁ బెట్టుకొని పరుండె నని, లేచిచూడగా, తామ్రవర్ణముగా నుండెనని, అందుచేత దీవికి 'తామ్రపర్ణి' యని పేరిడెనని తెలియుచున్నది. ఇంతకంటె, రాగిఆకు ఆకారముగానుండుటచేత,'తామ్రపర్ణి' యని పేరిడియుండ వచ్చునని, కూడ యొకయూహ కల్గుచున్నది;

46 ఆనంద కౌసల్యాయన — మహావంశము, (హింది) — విజయాభిషేకము పుట 44.

ఎట్లయినను ఈపేరు క్రీ. పూ. 4వ శతాబ్దము నుండి కలదనుటకు, పునరు చారిత్రకాధారములు లభించుచున్నవి.

క్రీ. పూ. 326 లో 'అలెగ్జాండరు' అను యవనభూపతి భరతవర్షముపై దండెత్తి వచ్చినప్పుడు, 'కాస్సండ్రియా' వాసి, 'అరిస్టోబోలసు' క్రీటు ద్వీపవాసి, 'నియార్కసు' ఐజానాద్వీపవాసి 'అనిసిక్రటసు' అను లేఖకులు కూడవచ్చిరి. 'అనిసిక్రటసు' నావికా దళములోనుండి ఓడచుక్కానిని బట్టియుండెను. ఆతడు తనయాత్రా వృత్తాంతములనువ్రాసెను. ఈలేఖ కుడు లంకను 'తాప్రోబేను' అనిపేర్కొని, ఇది 5000 స్టాడియోల పరి మాణముగలదనెను. 'మెగస్థనీసు' యొగాస్థనీసు' అను గ్రీకులేఖకులు దీనిని పేర్కొనిరి. 'మెగస్థనీసు' 'తాప్రోబేను' అనెను. 'ప్లిని' యను గ్రీకులేఖకుడు, రోము చక్రవర్తియగు 'క్లాడియసు' తోతామ్రపర్ణికి గల వాణిజ్య సంబంధమును పేర్కొనెను. దీనికి పూర్వనామము 'పరేసముద్ర' యని తెలియుచున్నది. అశోకుని గిర్నారు శిలాశాసనములలో గూడ దీనిపేరు, 'తాంబపన్ని' యని వ్రాయబడినది. 'పరేశముద్ర' యని కాని, 'పలిశముండు' అనికాని, లంకపేరు రామాయణములోలేదు. రామాయణమున 'సింహళ'మని కూడ వాడలేదు. విజయుడు పెట్టినపేరు, 'తామ్రపర్ణి,' క్రీ. పూ. 4వ శతాబ్దమునుండి గ్రీకు లేఖకులు వాడిరి; కాన రామాయణ రచన, క్రీ. పూ. 4వ శతాబ్దికి పూర్వమే జరిగియుండవచ్చును.

గ్రీకులు దీనిని అంటిక్థోనస్ (Antick-thonos) అనిరి; అలెగ్జాం డరు కాలమున అందలి ప్రజలను, 'పాలేగరి' (Palaegeri) అని పిల్చు చుండిరి. ఇతర గ్రంథకర్తలు లంకను సిమండన (Simoundon) అని, తాప్రోబేను అని పిల్చిరి. పెరిప్లసుకారుడు కూడా 'తాప్రోబేను' అనునది ప్రాచీననామమని, తన కాలమున దానికి 'పలేశముండ' (Palaisimundi) అని పిల్చెడివారని, ఇంకను ఈపేర్లు. అనగా సలికె (Salike) సెరినిల్వోసు (Serenellvous) సెరెదిబ (Serediba) సెరెనాబ (Serenaub) జైలన (Zeilan) శైలన (Sailan) సిలన్ (Ceylon) సలైలిని (Salailine) అనునవి లంకపేర్లని తెలియుచున్నవి. [47]

---

47 J. W. Maccrindle M. A— Ancient India as described by Ptolemy. P 251.

'ప్లీని' యను లేఖకుఁడు, 'సిలోను' ముఖ్యనగరము 'పలిశముండస్' యని (బహుశ పశైసిమంత) పెద్ద పట్టణమని, అనూరాధ పురము కావచ్చునని, రాజు ఎన్నుకొనఁబడుచుండెనని, 30 మంది సలహాదార్లుగల సభ కలదని, బౌద్ధులవలన సుఖమైన దీవియయ్యెనని, వ్రాసెను. 'నియార్కసు' లంకకు 'పశైశిమాండౌ' (Palaisimoundou) అని పేర్కొనెనని, 'అరియన్', వ్రాసెను.

ఈ పేర్లెవి 'రామాయణమున గాన్పింపవు; కాన క్రీ. పూ. 3వ శతాబ్దమునకు బూర్వపు రచనయే యగుచున్నది.

7. వింధ్యకు దక్షిణమునఁ గ్రమముగాఁ బోయిన మార్గమునకు ఆర్యులు దక్షిణాపథమని పేరు పెట్టిరి. దక్షిణమున కార్యులరాక 'అగస్త్యుని'తో నారంభమైనది, 'అగస్త్యుఁడు' క్రీ. పూ, 7 లేక 8వ శతాబ్దములోని వాఁడని డా. కాల్డ్వెల్ పండితు డభిప్రాయ పడెను. కాని ఈ యూహ సరికాదు. క్రీ. పూ. 14వ శతాబ్దిలో 'అగస్త్యుఁడున్న' ఆధారములు గలవు. ఆర్య సభ్యతను దక్షిణమునఁ బ్రవేశ పెట్టిన మొదటి ఆర్యుఁడు అగస్త్యుడే. 'అగస్త్యుఁడు' కొందరు బ్రాహ్మణులతోఁ గలసి, వింధ్యపర్వత ములదాటి, దక్షిణమున విదర్భ ప్రాంతమున నాశ్రమ మేర్పరచు కొనెను. ఈతఁడు ఋగ్వేద కాలపు ఋషి. రాముఁడితని దండకలోఁ గలసెనని, రామాయణము తెల్పును. ఈ ఋషి భార్య 'లోపాముద్ర'; ఈమె విదర్భ రాజగు 'దృష్టనిమి' కుమార్తె. అగస్త్యుఁడు 'దివోదాసుని' తండ్రియగు 'వ్యాధ్నస్యుని' చెంతకు ధనమున కేగెను. ద్రవిడులయొక్క సాహిత్యము, శాస్త్రజ్ఞానము నకారంభకుఁడని దక్షిణమునకు వలస వచ్చిన వారిలో మొట్ట మొదటి వాఁడని 'అగస్త్యుఁడు' కొనియాడఁ బడుచున్నాడు.

ఎల్లలను బట్టి చూడగా, ప్రస్తుతపు మహారాష్ట్ర దేశము, దండకారణ్యముగా గాన్పించుచున్నది. తమిళగ్రంథములను బట్టి చూడగా, అగస్త్యుఁడనేక వేల జనులతో వచ్చెనని తెలుచున్నది. అగస్త్యుని వింధ్యాద్రి గర్వ భంగగాథకు, చారిత్రకముగా నర్థము కైకొనవలె నన్న, ఆర్యులలో మొదట వింధ్యాద్రిని దాటినవాఁడు 'అగస్త్యుఁడే' యని పురాణ గాథల కర్థము జెప్ప వలయును. అగస్త్యుని రాకకుఁ బూర్వము దక్షిణదేశమే యెరుగని ఆర్యులకు, పంప, సింహళము మున్నగున వెట్లు తెలియును ?

ఆర్. జి. భాండార్కరు యిట్లు వ్రాసెను. "క్రీ. పూ. 7 వ శతాబ్దము నకు ముందు ఏమియుఁ దెలియదని, దీనివలన స్పష్టపడుచున్నది. తూర్పు మార్గముద్వారా ఆర్యులు ఉత్తర సర్కారుల వరకేగిరి; అంతకు మించి పోలేదు. వారికి వింధ్యకు దక్షిణముగా నున్న ప్రాంతముతోఁ బరిచయము లేదు. క్రీ. పూ. 350 కి బూర్వము, వారు మధుర తంజావూరుల వరకు వ్యాపించిన ప్రాంతముతో బరిచయము గలిగియుండిరి."[48]

కాన రామాయణ రచన ఆర్యులకు దక్షిణదేశముతో బరిచయము గలిగిన తర్వాత, అనగా క్రీ. పూ. 4 వ శతాబ్దికిఁ దర్వాత జరిగియుండ వలెను.

8. 'మహాభారతము'లో రామాయణ కథ గలదు. మహాభారత రచనా కాలము క్రీ. పూ. 250 వ సంవత్సర ప్రాంతమని, 'సౌతి' యాకాల మున గలడని, కొందరు మహారాష్ట్ర పండితులు వ్రాసిరి; కాని ఈ యూహతప్పనుట నిశ్చయము; మొదట కురుపాండవ యుద్ధమును వర్ణించిన గ్రంథమునకు 'జయ' యనిపేరు కలదు. ఇదియే వృద్ధి చేయ బడి, 'భారతము' అయ్యెను; ఇవి రెండును బుద్ధునికి బూర్వపువి, అని డా. 'బేల్వల్కర్' అను పండితుని యభిప్రాయమై యున్నది. బౌద్ధ ధర్మము నందలి విరోధము చేతనే, భారతము వృద్ధి చేయఁబడి, మహాభారతముగాఁ జేయఁబడినదని, పలువురు విద్వాంసుల యభి ప్రాయముతో నే నేకీభవించుచున్నాను.

'మహాభారతము' 'ద్రోణ పర్వము' వాల్మీకిని బేర్కొన్నది. ఈ పర్వ ములో నాతావున ప్రక్షిప్తములు కాని తావుననే 'వాల్మీకి' పేరుతో రెండు శ్లోకములు ఉదాహరింపఁబడినవి. ఇవి రామాయణము యుద్ధకాండ ములో నేవిధమైన మార్పు లేకుండ ఉన్నవి. వన పర్వములో 'రామో పాఖ్యానము' కలదు. ఇది రామాయణమునుబట్టియే వ్రాయఁబడినదని,

---

48 R. G. Bhandarkar—Bombay Gazetteer Vol I Part II — P 141.

Also R. G. Bhandarkar — collected works Vol III P 15.

"The Indian Aryans had thus no knowledge of South India previous to 7 th century B, C. etc."

అనేక శ్లోకములు, వాల్మీకి ఛందములతోఁ గలయు చున్నవని, తెలిసికొన వచ్చును.

ఇట్లు రామాయణ, మహాభారతములలో ననేక శ్లోకములు, కథలు, పాత్రలు, సమానములు కాన కొలదికాల వ్యత్యాసముతో నీరెండు గ్రంథములు వ్రాయఁబడి యుండవలయును. అందుచేతనే కొందఱు చరిత్రకారులు క్రీ. పూ. 400—200 మధ్యకాలములో రామాయణ, మహాభారత రచన జరిగెనని వ్రాసిరి. తిలక్, జ్యోతిష గణితరీత్యా, మహాభారత రచనా కాలము క్రీ. పూ. 5వ శతాబ్దమనెను. కాని ఒక్క జ్యోతిష పదమునుబట్టి, మొత్తము మహాభారతమునకు కాలనిర్ణయము చేయుట సాహసము. రామాయణకథ మహాభారతములో నుండుటచేత, నాప్రాంతముననో, కొంచెము పూర్వమో యిది వ్రాయబడియుండవలయును.

9. రామాయణములో 'బాలకాండము'లో రాముని జన్మదినము చైత్ర శుద్ధ నవమి యని, వసంతారంభమని, బృహస్పతి కటకములో నుచ్ఛయందుండెనని, మిగతా గ్రహము లుచ్ఛయందుండెనని యుండుట, రాశిచార మున్నగునవి చూడగా, ఫలిత జ్యోతిష భావములు కూడ భారతీయులకు గల సమయమందే యిది వ్రాయబడి యుండవలయును. ఈ గణితమును భారతీయులు గ్రీకులనుండి నేర్చుకొనిరి. హోరా, కోణరాసుల పేర్లు మున్నగున వన్నియు, గ్రీకుల పదములే. 'కోల్ బ్రూక్' ఈవిధముగా వ్రాసెను. "గ్రీషియనులు జ్యోతిషశాస్త్ర ప్రాథమిక సూత్రములను దెలియ జేసిన తరువాత శతాబ్దములోనే, హిందువులు ఆ శాస్త్రములోని పూర్వ పరిజ్ఞానము నార్జించిరి."

'పరాశర తంత్రము, గర్గ్య సిద్ధాంతము' అను జ్యోతిష గ్రంథముల బట్టి కూడ ఈ విషయము తేలుచున్నది. పరాశరుడు, యవనులు లేక బాక్ట్రియా గ్రీకులను గూర్చి ప్రశంసించెను. అందుచే నిది క్రీ. పూ. 2వ శతాబ్దము గావచ్చునని 'దత్తు' ప్రాచీన భారత వర్షములో వ్రాసెను. 'గర్గ్యుడు' బాక్ట్రియా గ్రీకుల దండయాత్రను వర్ణించెను. గ్రీకు విద్వాంసుల బ్రశంసించెను. 'యవనులు మ్లేచ్ఛులు; కాని వారిలో నీ జ్యోతిష శాస్త్రము బాగుగా స్థాపించబడినది. అందుచే వారు 'ఋషులుగా' గౌరవింపబడుచున్నారు" అని 'గర్గ్యుడు' గార్గ్యసంహితలో

వ్రాసెను. ఇతర చారిత్రకాధారములచేత,నీతని కాలము క్రీ. శ. 1వ శతాబ్ది యని దత్తు వ్రాసెను; కాన క్రైస్తవ శకారంభమునకు భారతీయులకు ఫలిత జ్యోతిషము తెలియునని, తెలియుచున్నది. స్ట్రాబో, బ్రాహ్మణులకు జ్యోతిషము ప్రియమైన వృత్తియని శ్లాఘించెను.

గ్రీకులీ గణితమును భారతీయులనుండి నేర్చుకొనిరి. బాబిలోనియనుల భాష 'అరమైక్' లేక 'ఛాల్డెయిక్'; అందుచే వారిని 'ఛాల్డేయనులు' అందురు. వీరు భవిష్యత్తు చెప్పుచుండిరి; వంశపారంపర్యముగా, నీవిద్య వీరిలో నుండెను. ప్రజలు వీరిని గౌరవించుచుండిరి. వీరు నక్షత్రముల జూచి ఫలితాంశముల జెప్పు పద్ధతిని, సక్రమమైన శాస్త్రీయ పద్ధతిలోనికి మార్చిరి; సూర్యచంద్రగ్రహణములనుగూడ వీరు తెల్పగల్గుచుండిరి.

బృహస్పతి, శుక్రులుశుభులని, కుజశనులు శత్రువులని, బుధుడు స్థానమునుబట్టి శుభమో, యశుభమో యగునని వారు తెలిసికొనిరి. రాశిచక్రము వేయుపద్ధతి, క్రీ. పూ. 1వ శతాబ్దమునకు గాని, గ్రీకులలో బూర్తి కాలేదు. క్రీ. శ. 1వ శతాబ్దమునకుగాని ఈ శాస్త్రము భారతీయులలో వ్యాపింపలేదని, 'వీబరు' పండితుడు వ్రాసెను. కాన 'బాలకాండము' క్రీ. శ. 1వ శతాబ్దములో గూర్చబడి యుండవలయును. 'వీబరు' మొత్తము రామాయణమే క్రీ. శ. 1వ శతాబ్దములోని రచనయని యొకచోట వ్రాసెను. 'జయచంద్ర విద్యాలంకారు' అనుచరిత్రకారుడు రామాయణము యొక్క అంతిమ రూపము క్రీ. పూ. 1వ శతాబ్దము నాటికి బూర్తియైనదని వ్రాసెను; కాని హేతువుల చూపింపరైరి.

ఇంకను 'వింటర్ నిట్జ్' కూడ తన హైందవ సాహిత్య చరిత్రములో భారతీయులు చంద్రునితో గలసియుండు నక్షత్రము లెరుంగుదురు కాని, సూర్యునితో గలియు సందర్భము లెరుంగరని, విషువత్తులు తెలియవని, అవి ప్రాచీన వాఙ్మయములో గాన్పింపవని, క్రీ. పూ. 1100 ప్రాంతమున నివి తెలిసియుండవచ్చునని వ్రాసెను; కాని కాలనిర్ణయము అనుమానముగా నున్నది. ఇంకను 'బార్నెట్' అను విద్వాంసుడు ఆకాశమును 24 నక్షత్రములుగా విభజించుటకు 'ఛాల్డియనులు' కారకులని, దీనినుంచియే, వారము నేడుదినములుగా సూర్యుడు, చంద్రుడు, మిగత ఐదుగ్రహముల ననుసరించి విభజించుపద్ధతి కల్గినదని, 'అలెగ్జాండ్రియా' నుండి భారతీయులు దీనిని

గ్రహించిరని, అందుచేతనే, తరువాత వాఙ్మయములోనివి కాన్పించినవని, వ్రాసెను. జ్యోతిష శాస్త్రములో గల ప్రవేశముచేత, యవనులను భారతీయులు 'సర్వజ్ఞ' యని పిల్చుచుండిరి; ఇంకను 'డంకర్' అను విద్వాంసుడీ విధముగా వ్రాసెను. "భారతీయుల సంవత్సరము 30 రోజులు గల 12 నెలలుగా విభజింపఁబడినది. నెల రెండు పక్షములుగా నున్నది, రోజు 30 ముహూర్తములైనది. 330 దినములు సంవత్సరముగా మార్చుకొనుటకు, బ్రాహ్మణులు, పంచ వర్షములతో గలయు కాలచక్రము, అనగా 1860 చాంద్ర దినములుగా విభజించిరి. మూడుఏండ్లకు 30 చాంద్ర దినములు గల 12 నెలలుండెను; 3 వ, 5 వ సంవత్సరముసకు, అన్నియే రోజులు కల 13 నెలలుండెను. ఈ ఏర్పాటు వలన కాలచక్రములో మామూలు కాలము కంటె 4 దినము లధికమగుచున్న విషయము, బ్రాహ్మణులు గ్రహింపజాల కుండిరి. ఈ కారణమున వారు నేర్పరులైన, జ్యోతిష శాస్త్ర వేత్తలు కారు." (History of antiquities - Vol IV - P 283 - 284) 'వీబరు' మున్నగు విద్వాంసుల వ్రాతల ప్రకారము, కాలమును గుణించు పద్ధతిని భారతీయులు బాబిలోనియనులనుండి నేర్చుకొనిరని, తెలియవచ్చు చున్నది [49].

ఇంకను 'కేంబ్రిడ్జి హిందూదేశ చరిత్ర కారుడు. (I వస. 140 పుట) 'బాబిలను' నుండి నక్షత్ర జ్ఞానము కల్గినదనుట న్యాయముగా నున్నదని, నక్షత్రములనునవి అచటనుండియే ఉద్భవించెనను విషయమింకను గనిపెట్ట వలసి యున్నదని,' వ్రాసినాడు. కాన ఈ జ్యోతిష శాస్త్రజ్ఞానము కల్గిన తర్వాతనే, అనగా క్రైస్తవ శకారంభమునకు దర్వాతనే, రామాయణ రచన జరిగి యుండవచ్చును.

10. రామాయణములో పాణిని విరుద్ధ ప్రయోగములు గలవని 'మాక్డనాలు' మున్నగు విద్వాంసులు వ్రాసిరి. 'పాణిని' క్రీ. పూ. 4వ శతాబ్దమున లౌకికి భాషను దిరుగ వికారము లేరు పడకుండ, నివారించినాడు. అతడిటుల సంస్కరించుట చేత, దీనికి 'సంస్కృత' మని పేరు వచ్చినది. సంస్కృత మనెడి ఈ పేరు ప్రాకృతమను దానికి బ్రతిద్వంద్విగ నేర్పడినదని, 'మాక్డనాలు' పండితు డూహించెను.

---

49 J. W. Maccrindle- The invasion of India-P. 359

ఆదికావ్యమైన 'రామాయణము'న గూడ సంస్మృతము [illegible] గలదు. పాణిని కాలము క్రీ. పూ. 350 అని అనేక [illegible] దెల్పుచున్నవి. 'మాక్డనాలు' సూత్రకాల ముఖ్యము [illegible] క్రీ పూ. 350లో 'పాణిని' కలడనెను. '[illegible]', [illegible] మున్నగువారు క్రీ. పూ. 4వ శతాబ్దమునిరి. '[illegible]' [illegible] క్రీ. పూ. 350 అని వ్రాసెను. చరిత్రకారు [illegible] కైకొనిరి. పాణిని క్రీ. పూ. 400 ప్రాంతమున జన్మించి [illegible] నని, కథాసరిత్సాగర మతనిని పాటలీపుత్రములోని [illegible] ([illegible] గుప్తుని) కాలమున నుంచినదని 'గోవెన్' [illegible] '[illegible]' సాహిత్యచరిత్రమున వ్రాసెను. పాణిని '[illegible]' [illegible] గాన్పించుచున్నాడు 'భాండార్కరు' క్రీ. పూ. 7వ శతా[illegible] మున 'పాణిని' కలడనెను కాని ఆధారములు [illegible] 'హాప్కిన్సు' అను అమెరికా విద్వాంసుడు 'పాణిని' క్రీ. పూ. 3 [illegible] శతాబ్దమునకు బూర్వుడు కాదనెను. పాణినియింకను, [illegible], బ్రాహ్మణ, కల్ప. సూత్రకార, యవన, మహా[illegible] బేర్కొనుటచేత, క్రీ. పూ. 4 వ శతాబ్దమునకు బూర్వుడు [illegible] తోచుచున్నది. 'బెల్వాల్కరు' క్రీ. పూ. 700 లో పాణిని [illegible] ననెను కాని ఆధార రహితము. ఈ ప్రకారము ఈతని కాలమును గూర్చి క్రీ.పూ. 2000 నుండి క్రీశ. 1వ శతాబ్దమువరకు 30 [illegible] 30 [illegible] ముల బేర్కొనిరి. 'ఆర్యమంజుశ్రీమూలకల్పమును' బట్టి, శ్రీ [illegible] ప్రసాదజయస్వాలు, వైయాకరణపాణిని' క్రీ. పూ. 3[illegible] [illegible] రాజ్య మేలిన 'మహాపద్మనందుని' కాలమున[illegible] [illegible]. ఇది చాల ముఖ్యమైన విషయము.

శ్లో॥ వరరుచిర్నామ విఖ్యాత । అతిరాగో అహాత్ తదా (13[illegible])
నియతం శ్రావకేబోధా । తస్యరాజ్ఞో భవిష్యతి
తాస్యాస్యంతమః సఖ్యుఃపాణి నిర్నామమాణవః॥ (137)

దీనినిబట్టి 'మహాపద్మనందునికి, 'వరరుచి' [illegible] గాఢమగు అనురాగము కలదని, వానిచెంతనే [illegible] 'పాణిని' [illegible] మాణవుడని తేటతెల్లమగుచున్నది. కాని, క్రీ. పూ. [illegible]

నిశ్చయము. పాణిని విరుద్ధ ప్రయోగములుండు కతమున, మూలరామాయణము అనగా 2_6 కాండములు, క్రీ. పూ॰ 4వ శతాబ్దికి బూర్వమే రచింపబడియుండవలయును. వర్తమాన రామాయణము 'పాణిని'కి దర్వాతదే యగుచున్నది.

11. రామాయణములో (బాల 15_2) వేద, వేదాంగములను శబ్దములు గలవు. శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషములను 6 అంగములను, వేదాంగము లందురు. ప్రాతిశాఖ్యలను వేదవ్యాకరణ సూత్రములు శిక్షాసంబంధములు. ఇవి యన్నియు క్రీ. పూ. 500_200 మధ్యకాలములోనివి. శ్రౌత, గృహ్య, ధర్మసూత్రములను మూడు సూత్రములను గలిపి, కల్ప సూత్రములందురు. కల్ప సూత్రకారులలో, ముఖ్యులు, ప్రాచీనులు 'బోధాయన, ఆపస్తంబులు.' 'బుహ్లరు' అభిప్రాయానుసారము, వీరు క్రీ. పూ. 5వ శతాబ్దములోని వారు; సూత్రగ్రంథజాలము క్రీ. పూ. 500_200 అని 'మాక్డనాలు' వచనము ప్రామాణికముగానున్నది. 'పాణిని' రచిత వ్యాకరణము క్రీ. పూ. 350 నాటిది; కాని 'పాణిని' 'శకటాయనుడను' జైనుని వ్యాకరణమును సర్వవిధముల ననుకరించెనని, పెక్కురు విద్వాంసులు వ్రాసిరి. ఇది సత్యమే కావచ్చును. పూర్వపు నిరుక్తమును గైకొని, 'యాస్కుడు' క్రీ. పూ. 5వ శతాబ్దములో వ్యాఖ్యను వ్రాసెనని, కొందరు వ్రాసిరి; కాని యాస్కుడింకను పూర్వుడని మా యభిప్రాయము.

'పింగళుడు' ఛందస్సు నిర్మాత. భగవాన్ పింగళుడు పాణిని కనిష్ఠ భ్రాతయనిఁ 'షడ్గురు శిష్యుడు' వేదార్థ దీపికలో వ్రాసెను. (7_9); 'వీబరు, మాక్సు ముల్లరుకూడ నీ విషయమును చేర్కొనిరి; కాన పింగళుడు కూడ క్రీ. పూ. 350 ప్రాంతపువాడు.' ఫలితజ్యోతిషవిద్య గ్రీకులు, మన దేశములో స్థిరపడిన పిమ్మటనే, కల్గినది. క్రైస్తవ శకారంభమునకుగాని, ఈ విద్య వ్యాప్తికాలేదు; కాన బాలకాండ రచనము క్రీ. శ. 1వ శతాబ్దిలోగాని జరిగియుండనేరదు. బాలకాండములో (14_38½) కల్పసూత్రములు, బ్రాహ్మణములు, అను శబ్దములుకూడ కలవు. ఆపస్తంబ కల్పసూత్రములలో గూడ, 'వేదాంగములు'అను శబ్దము వాడబడినది; అయినను ఆతని కాలము, క్రీ. పూ. 5వ శతాబ్దియని 'బుహ్లరు'అభిప్రాయము;

వేదాంగిములు మరియొక రూపముగా నున్నను, రామాయణ రచన క్రీ. పూ. 500 కంటె పూర్వము కాజాలదు.

12. రామాయణమున 'కపిలుని' పేరనేక చోట్ల తగులుచున్నది. కాన 'కపిలుని' తర్వాతనే రామాయణ రచన జరిగియుండ వలెను బుద్ధుడు కపిలవస్తు నగరములో జన్మించెను. పాళీగ్రంథమగు 'దాతవంశ ప్రకారము కపిలఋషి అనుజ్ఞ చేత కపిలవస్తు నగరమును హిమాలయముల యొద్ద ఇక్ష్వాకు కుమారులు గట్టిరని తెలుచున్నదని 'దత్తు పండితుడు' వ్రాసెను. 'కపిలుడు' బుద్ధుని కొక శతాబ్దము పూర్వుడని దత్తు వ్రాసెను. 'డేవిస్' అను విద్వాంసుడు సైతము క్రీ; పూ. 7వ శతాబ్దములో 'కపిలుడు' కలడనెను; కాని ఈ యూహ సరికాదు. మహాభారతమును బరిశీలింపగా (XI_218_15) ఉద్దాలక ఆరుణి శిష్యుడు 'యాజ్ఞవల్క్యు'డని, ఇతని శిష్యుడు 'ఆసురి' యని ఆసురి భార్య కపిలయని, ఆసురి పెంపుడు కుమారుడు 'పంచశిఖుడని' తల్లి కపిలనుబట్టి 'పంచశిఖుని' కాపిలేయుడని పిల్తురని కలదు. ఈ పంచశిఖుని శిష్యులు 1. సులభ 2. జనకజాన దేవుడు (మిధిలరాజు)

జనకజాన దేవునికి పంచశిఖుడు సాంఖ్యము నేర్పెను. 'సులభ' జనకధర్మధ్వజునికి గురువునొద్ద నేర్చు కొన్న సాంఖ్యము నేర్పెను. (మ. భా. X-I 321—122) కనుక సాంఖ్యము బోధించిన 'కపిలుడు' ఈ పంచశిఖుడే కావచ్చును. 'ఆసురి' యొక్క పేరు ప్రాచీనములగు ఉపనిషత్తులలోగూడ కాన్పించు చున్నది; కాన ఆసురి పెంపుడు కుమారుడగు 'కపిలుడు' క్రీ. పూ. 8వ శతాబ్దిలోని వాడు కావచ్చును; కాన రామాయణ రచన క్రీ. పూ. 8వ శతాబ్దికి దర్వాతనే జరిగియుండవచ్చును.

పైనజెప్పిన జనకధర్మధ్వజుని కుమార్తెయే 'సీత' యని, పలువురు వ్రాసిరి; కాని యిది తప్పు. రామాయణములో జెప్పబడిన ప్రకారము, సీత శీరధ్వజ జనకుని కుమార్తె యని తెలుచున్నది. ఈతడు విదేహరాజులలో 26వ వాడు; ఈ వంశములోనే 'జనకజానదేవుడు' 58వ వాడు; జనకధర్మధ్వజుడు 59వ వాడు నైయున్నారు.

13. రామాయణములో పహ్లావులు, యవనులు, శకులు, మ్లేచ్ఛులు, కాంభోజులు, హాకీతులు, కిరాతులు (బా కాం 54-55) మున్నగు పేర్లుకలవు.

పహ్లావుల పేరు పురాతనమైనదే. వీరికే 'పార్థివులని' పేరు. శకుల పేరు క్రీ. పూ. 4వ శతాబ్దినాటికే భారతీయు లెరింగియుండిరి. పాణిని గణపాఠములో శకుల బేర్కొనెను. 'మెగస్థనీసు' హిందూదేశ జాతులు 118 అనిచెప్పి, హిమాలయముల కావల ఈదేశము 'సిథియనులు' లేక శకులని పిలువబడు జాతుల వారిచే వాసము చేయబడెను' అని వ్రాసెను.

వీరు టర్కీదేశపు ద్రిమ్మరులు. యూచీలు (ఋషికులు) వీరిని బాగ ద్రోలగా, వీరు క్రీ. పూ. 175వ సంవత్సర ప్రాంతమున, 'జక్సార్టసు' నది కుత్తరముగా నున్న పచ్చిక బయళ్ళనుండి, దక్షిణముఖముగా బయలుదేరి వచ్చిరి. 30 లేక 40 ఏండ్ల తర్వాత 'పార్థియనులు' మున్నగువారు వెంబడింపగా సింధునది ప్రాంతములకు వచ్చిరి. యవనులనగా గ్రీకులు; రావిల్సను, గ్రీకునకు హీబ్రూసంస్కృతములలో 'యవన' యని ప్రాచీనపర్షియను' భాషలో, 'యౌన' యని, కలదని వ్రాసెను. ఈ శబ్దమునుండియే, 'యవన, యౌన' శబ్దము లావిర్భవించినవి. భారతీయులు మొట్టమొదటగా, 'అయోనియనుల' గూర్చి, పారసీకుల మూలముగా వినియుండిరి. [50] ఇంకను 'యవన శబ్దము' భారతీయ సాహిత్యములో ప్రప్రథమముగా, పాణిని 'గణపాఠము'లో వాడెనని, స్త్రీలింగరూపము 'యవనాని' అని, కాత్యాయనుడు కూడ 'యవనలిపి'ని బేర్కొనెనని, 'గోల్డుస్టకర్' పాణినిని బుద్ధునకు బూర్వమనెనని, కాని తర్వాత లభించిన సాంప్రదాయములబట్టి, ఆఖరు నందరాజు సమకాలీనుడని తెలుచున్నదని, ఆతనికి ఖరోష్ఠీ లిపిలో వ్రాయబడిన నాణెముల పైననున్న, వర్ణములతో బరిచయమున్న ఆధారములు గలవని, 'రావిల్సను' వ్రాసెను. [51] మహాభారతములోగూడ నొకచోట యవనుల (II-14-4) పేరుకలదని ఈ లేఖకుడే వ్రాసెను.

యవనులు గ్రీకులే యనుటకు శాసనాధారములు కూడ కలవు. క్రీ. పూ. 3వ శతాబ్దములోని 'గిర్నారు' రెండవ శిలా శాసనములో స్పష్టముగా 'యోనరాజు, అంటియోకి' యని యున్నది. (పంణీ అంతియకో యోనరాజా సం. అన్తియోకో నామ యవనరాజో) ఈరాజు 'బాబిలోనియా'లో

---

50. H. G. Rawilson -Intercourse between India and the western world P 20.

51. Ibid—P 26.

‘ఫ్హాల్లినిష్టిక్’ రాజవంశమునకు మూలపురుషుడగు ‘సెల్యూకస్’ తర్వాత వచ్చిన యవనరాజు ‘అంటి యోఛసస్’. ఈతని యొద్దకు ‘అశోకుడు’ భిక్షువులనైతము పంపియుండెను. కాన క్రీ; పూ. 3వ శతాబ్దమునుండి భారతీయులకు యవనులకు గల సంబంధము స్పష్టపడు చున్నది. ‘సోక్రటీసు’ యొద్దకు కూడ భారతీయులు వెళ్ళిమాటాడినట్లు ‘యూసేబియసు’ అను గ్రీకు లేఖకుని వ్రాతలు దెల్పుచున్నవి. క్రీ. పూ. 6వ శతాబ్దిలోని ‘పైథాగరసు’ భారతవర్షములో దర్శనశాస్త్రము జదువుటకు వచ్చెనని ‘డాక్టర్ ఎన్ఫీల్డ్’ వ్రాసెను; కాని యిది అనుమానాస్పదముగా నున్నది. క్రీ. పూ. 5వ శతాబ్దములోని చరిత్ర జనకుడగు ‘హిరోడోటసు’ హిందువులను గూర్చి వ్రాసెను. క్రీ. పూ. 326లో ‘అలెగ్జాండరు’, మువ్వురు లేఖకులును, క్రీ. పూ. 302లో ‘మెగస్థనీసు’ను భారత భూమికి వచ్చిరి. యవనులతో భారతీయులకుగల సంబంధము. క్రీ. పూ. 6వ శతాబ్దినుండి యున్నను, ‘అలెగ్జాండరు’ రాకతో నది అధిక మాయెను. (క్రీ. పూ. 326)

ఇంకను ‘మహావంశము’లో యోనదేశమునకు రాజధాని, యోనుల ‘అలసండ’ యని, క్రీ. పూ. 137 లో ‘రుయానవెల్లి’ లోని గొప్ప ఉత్సవమునకు 30000 మంది భిక్షువులు వచ్చి రని, వ్రాయబడి యున్నది. ఈ ‘యోనులు’ ‘యవనులే’ కావచ్చును. పశ్చిమ ఆసియా ఖండమంతట, గ్రీకులు ‘యవన’ యని, ‘అయోన్’ అని, ఎరుంగబడుచుండి రని, ‘గ్రిఫిత్’ పండితుడుకూడ వ్రాసెను.[52] బుద్ధుని నిర్వాణానంతరము 250 ఏండ్లకు, ‘యోనపురోహితుడు’ ధమ్మరక్షితను ‘అపరాంత’కు మతాచార్యుడుగా పంపిరని, ‘మహారక్షిత’ యనువానిని ‘యోనదేశము’ నకు బంపిరని, ‘మహావంశము’ తెల్పుచున్నది. అశోకుని క్రింద ‘యవన తుషస్ఫుడు’ సౌరాష్ట్రి పాలకుడైయుండెను. సాంచి శాసనము ‘యవన’ యని పేర్కొన్నది. కాన ‘యవన’ శబ్దము భారతీయు లెరుంగుదురు.

ఇంకను ‘వేశనగిర స్తంభ శిలాశాసనముపైన, ‘అంటియాల్కిదాసు’ యొక్కరాయబారి ‘హెలిడోరసు’ యోనదూతగా పేర్కొనబడినాడు. ఇంకను ‘అకమీనియను రాజుల శాసనములబట్టి కూడ, గ్రీకులకు ‘యౌన’ (yauna) అను పేరు కలదని తెలియుచున్నది.

52. Griffith—Valmiki Ramayana P 550.

ఇంకను 'మహాభారతము'లో (XII-207-43).

శ్లో॥ "యౌన కాంభోజ గాంధార కిరాత బర్బరైస్సహ"

అని యున్నది. ఈ కారణమున 'యవనశబ్దము' గ్రీకులకే వర్తించునని తెలిసికొనవచ్చును. కాన 'యవనులను గూర్చి తెలిసిన పిమ్మటనే, వర్తమాన రామాయణ రచన అనగా మూలరామాయణము సంస్కరింపబడియుండుట, జరిగియుండవలెను; అనగా క్రీ. పూ. 3వ శతాబ్దికి తర్వాతనే యగు చున్నది.

14. రామాయణములో ననేక చోట్ల 'చైత్యము' అనుపదము వ్రాయబడినది. (అయోధ్యాకాండ 3-18, 6-11, 13-6½, 25-41, 72-43, 43½, సుందరకాండ 2-14, 15-15½, 43-1, 3, 5, 7, 58, 116, యుద్ధకాండ 84-12½) ఇది బౌద్ధుల దేవాలయమని, భాష్యకారులగు విద్వాంసు లనేకులు వ్రాసిరి. హిందూ దేవాలయములప్పటికి లేవు. హిందువుల విష్ణు మందిరములు, క్రీ. పూ. 2 వ శతాబ్దములో గలవని, 'విదిశా' యొద్ద 'నగరి'లోని శిలాశాసనములబట్టి తెలియుచున్నది; 'విదిశ'లోని యొక విశాల స్తంభము పైన గల శిలాలేఖనము చేత, 'రాజా ఆంటియోక్లిడసు' సమయమున 'తక్షశిలా' నగరములో నివసించు, 'డయన్' పుత్రుడు 'హెలియోడోరసు' అను భాగవతుడు, 'వాసుదేవునికి గరుడ ధ్వజము వేసెనని తెలియుచున్నది. ఇది తప్ప ప్రాచీన హిందూ దేవాలయములు కాన్పింపవు. క్రీ. పూ. 5 వ శతాబ్దములోని 'పిప్రవా' శాసనము బౌద్ధులకు ముఖ్యమైనది. ఇదియే బౌద్ధుల మొదటిస్తూపము. శాక్యులు బుద్ధదేవుని అస్థుల నొక పాత్రలో నుంచి, సమాధిగా గట్టించిరి. దీనిమీదనే 'చైత్యము' కట్టబడు చుండును. అశోకుని కాలములోనే చైత్యము లారంభమైనవి. (క్రీ. పూ. 3 వ శ.) అట్లయినచో రామాయణ రచన, క్రీ పూ. 3 వ శతాబ్దికి తర్వాతనే జరిగియుండవలయును; కాని భాష్యకారులగు 'గోవిందస్వామి' మున్నగువారు పొరపాటు పడిరని తోచుచున్నది. రాముని కాలమున బౌద్ధాలయము లెట్లుండును? చైత్యమనగా బౌద్ధాలయమని యర్థమున్నను, రామాయణములోని పదమునకీ యర్థము కాజాలదు. చైత్యమను పదము బుద్ధుని కాలములోనే యుపయోగింప బడినది; చూడుడు, ధర్మపదము బుద్ధవగ్గము 10వ పద్యము;

# ప్రాకృత పాఠము

బహుం వేసరణం యన్తి పబ్బతాని బనానిచ
ఆరామ రుక్ఖచేత్యాని మనుస్సా భయతజ్జితా॥

# సంస్కృత పాఠము

**శ్లో॥ బహు వైశరణం యన్తి పర్వతాని వనానిచ**
**ఆరామవృక్ష చైత్యాని మనుష్యా భయం వర్జితాః॥**

ఆంగ్లేయ భాషలోనికి తర్జుమా చేసిన పండిత యస్. కే. భాగవత్, చైత్యమును చోట ష్రైన్ (Shrine) అని వాడెను. హిందీ అనువాదకుడైన 'భదంత ఆనంద కౌసల్యాయనుడు' చైత్యమనియే వాడెను. తెలుగు ధర్మ పదములో దీని కర్థమేలేదు. భయాకారణమున మనుజులు అనేక స్థలము లలో ననగా పర్వత, వన, ఆరామ, వృక్ష, చైత్యాదులందు శరణమును బొందుచున్నారని దీని యర్థము. బుద్ధభగవానుని కాలము నాటికి హిందూ ఆలయములు కాని బౌద్ధాలయములు కాని లేవు. 'ధర్మపదము' బుద్ధుని చేత స్వయముగా చెప్పబడినది. 'జేతవనము'లో అగ్నిదత్తుడను బ్రాహ్మ ణునితో పై వచనములు బుద్ధుడు వచించెను. కాన చైత్యమున కర్థము యజ్ఞశాల, రచ్చమ్రాను కావచ్చును. బౌద్ధాలయము మాత్రము కానేరదు. బౌద్ధ వాఙ్మయములో నీపదముండుటచేత చైత్యముల నిర్మాణానంతరము రామాయణ రచన జరిగెనని, వాదింప వీలులేకున్నది; కాని యితర బౌద్ధ శబ్దములను బట్టి వర్తమాన రామాయణ రచన బౌద్ధమతోదయము తర్వా తనే యని చెప్పవచ్చును.

15. రామాయణములో మనువు పేరు కలదు. (కిష్కింధాకాండ 18_31) మనువు కాలము క్రీ. పూ. 350 అని, 'జోహాంతగిన్' వ్రాసెను. ధర్మశాస్త్ర యితిహాస కర్తయగు 'పాండురంగ వామనకాణే' క్రీ శ..

2వ శతాబ్దికి బూర్వమే 'మనుస్మృతి' యిప్పటి రూపమును దాల్చిన దని, అనుకొనవచ్చును అని వ్రాసెను.

'బుహ్లారు' మనుస్మృతి కాలనిర్ణయము జేయుచు, క్రీ. పూ. 200—క్రీ. శ. 200 మధ్యకాలములో మనుస్మృతి రచన యనెను. జయచంద్ర విద్యాలంకారు' అను భారతీయ చరిత్రకారుడు తన యితిహాస చరిత్రములో క్రీ. పూ. 150వ సంవత్సర ప్రాంతమున, బౌద్ధ వైరభావములతో, భృగువంశీయుడు మనుస్మృతి రచించెనని వ్రాసెను. మహాభారతములోని అనేక శ్లోకములు, మనుస్మృతిలో గాన్పించుచున్నవి. పాశ్చాత్య విద్వాంసులు పలువురు 'మనుస్మృతి' రచనము క్రీ. శ. 1వ శతాబ్దములో జరిగెననిరి. 'హావెల్' క్రీ. శ. 1—2 శతాబ్దములలో 'మనుస్మృతి' రచనయనెను. అట్లయినచో రామాయణ రచనము, క్రైస్తవ శకారంభముననో, కొంచెము పూర్వముననో జరిగియుండెనని చెప్పవలయును; కాని ఈ మనువుకాదని తోచుచున్నది. 'మనుస్మృతి'కి మూలభూతమగు 'మానవ ధర్మశాస్త్రము' ఒకటి కలదని, దానినుండి పెక్కువాక్యములు 'వసిష్ఠస్మృతి' లోనికి వచ్చెనని, దీనినుండి కొన్ని వాక్యములు 'మనుస్మృతి' లోనికివచ్చెనని, 'మాక్డనాలు' వ్రాసెను. అట్లయినచో, 'మానవ ధర్మశాస్త్రము' క్రీ. పూ. 5వ శతాబ్దమునకు బరము కాజాలదు. ఈ మనువును బేర్కొన్న రామాయణముకూడ' ఆ కాలపుదో, అంతకు తర్వాతదో యైయుండవలయును.

16. కిష్కింధా కాండములో సీతను వెదకు సందర్భములో, మగధ, పుండ్ర, వంగ దేశములు, నర్మద, గోదావరి, కృష్ణానదులు, అవంతి. విదర్భ, కళింగ, ఆంధ్ర, చోళ, పాండ్య, కేరళ దేశములు, పాండ్యరాజుల పట్టణము, ఋషభపర్వతము మున్నగు పేర్లును, ఉత్తరమున మ్లేచ్ఛ, యవన, శక, బాహ్లీక, పౌరవ, టంకణ, చీనా, ఉత్తరచీనా, ఉత్తర కురు, మొదలగుపేర్లు కలవు. పాండ్య, చేర (కేరళ) చోళరాజ్యములను మూడు ద్రావిడ రాజ్యములు క్రీ పూ. 4వ శతాబ్దినాటికే ప్రసిద్ధి చెందియుండెను. మత్స్య పురాణమును బట్టి చూడగా, దుష్యంతుడు సగర సహాయముతో పౌరవసింహాసన మాక్రమించుకొనెనని, తుర్వసుల దక్షిణమునకు దరిమెనని, వారటకేగి, పాండ్య, కేరళ, చోళ, కర్ణరాజ్యముల (కర్ణాటక) నేర్పరచిరని తెలియుచున్నది. పాండురాజు

వంశీయుల పేరుతో, పాండ్యరాజ్యమేర్పడెనని, కొందరియభిప్రాయము. శ్రీకృష్ణుని కూతురు 'పాండు' అను నామెకీరాజ్యమివ్వబడుటచేత, పాండ్యరాజ్య మను పేరుకల్గినదని, బ్రాహ్మణులు తనకు చెప్పిరనియు ఇది చాలప్రాచీన మైనదనియు, 'మెగస్తనీసు' అను యవనరాయబారి వ్రాసెను. [53] ఆయన 'పాండియన్' అని పేర్కొనెను. క్రీ. పూ. 5వ శతాబ్దములోని 'విజయుడు' పాండ్యరాజు కుమార్తెను బెండ్లాడెను. దక్షిణ రాజ్యముల నెరింగిన ప్రథమనావికుడు 'విజయుడే'; 'కాత్యాయనుడు' కూడ దీనిని జేర్కొనెను. అశోకుడుకూడ 'పాండ్యను' జేర్కొనెను [54] 'చీనా' మున్నగు దేశములను భారతీయులు క్రీ. పూ. 3వ శతాబ్దికి బూర్వమే యెఱింగియుండిరని, విద్వాంసుల యభిప్రాయము; కాన క్రీ. పూ. 3వ శతాబ్ది ప్రాంతముననే రామాయణ రచన జరిగి యుండవచ్చును.

7. హనుమంతుని సుగ్రీవుడు (కిష్కింధాకాండ 44-7) న్యాయ పండిత యని పిల్చెను. ఈతడు గౌతముడు కావచ్చును. న్యాయ శాస్త్ర కర్త గౌతముడు క్రీ. పూ. 500 కు బూర్వుడే యని, మాక్డనాలు, క్రీ. పూ. 6 వ శతాబ్దపు వాడని 'బుహ్లరు' వ్రాసిరి. ఆచార్య సతీశ చంద్ర విద్యా భూషణుడు, గౌతముని కాలము క్రీ. పూ. 550 అని అనేక కారణముల సూచించెను. ఒక గౌతముని ఆశ్రమము, రామాయణములో జేర్కొనబడినది. ఈ గౌతముడు, వాల్మీకి సమకాలీనుడు; న్యాయ కర్త గౌతముడు, కీ. పూ. 500 ప్రాంతపువాడు, అనిదత్తు, మాక్డనాలు, ముల్లర్, ఆచార్య సతీశచంద్ర, కె. వి. రంగస్వామి మున్నగువారు వ్రాసిరి. రామాయణ రచయిత, న్యాయశాస్త్రము నెరింగినట్లు తోచుచున్నది. ఈ కారణమున వర్తమాన రామాయణము, న్యాయశాస్త్రమునకు తర్వాత రచనయే యగుచున్నది; కాన క్రీ. పూ. 5వ శతాబ్దికి బరమేయగుచున్నది. ఇంకను ప్రాకృత భాషా శబ్దము లేమియు

---

53. Macrindle-Ancient India as described by Megasthenes and Arrian.

54. అశోకుని శిలాశాసనములు - కాల్సి 2వ శాసనము. "అథా చోడా పండియా సాతియపుతో కేలలపుతో తంబపంని."

నుండక, శుద్ధ సంస్కృత పదములతో వాడబడుటచేత, ప్రాకృత భాషా పదములు చేరియుండుటను, లౌకిక సంస్కృతము వ్యాప్తిలోనున్న కాలముననే వ్రాయబడుట నిశ్చయము.

18. రామాయణములో 'వంగదేశము' పేరుగలదు. 'కిష్కింధాకాండము'లో సీతాన్వేషణ సందర్భమున, మగధ, పుండ్ర, వంగదేశములలో సీతను వెదకవలయునని యున్నది. 'అయోధ్య కాండము'లో 'దశరథుడు కైకేయితో మాటాడు సందర్భమున సూర్యుని రథచక్ర మెంతవరకు బోవునో అంతవరకు తన రాజ్యము గలదని చెప్పి తన వశములోనున్న రాజ్యముల నిట్లు పేర్కొనెను.

శ్లో॥ ప్రాచీన స్సింధు సౌవీరా । సౌరాష్ట్రా దక్షిణాపథాః
వంగాంగ మగధామత్స్యా స్సమృద్ధాః కాశికోసలాః॥

తా. తూర్పుదిక్కులోనున్న రాజ్యములు సింధు, సౌవీర, సౌరాష్ట్ర దక్షిణాపథ, వంగ, అంగ మగధ, మత్స్య, కాశి, కోసల, దేశములు సకల సంపదలతో గూడి యున్నవి. ఇవి యన్ని దశరథుని క్రిందనున్న వనగా, ఆర్యులాక్రమించిరని యర్థము. ఈ రాజ్యములన్ని దశరథుని క్రింద నున్నచో దశరథుడు సార్వభౌముడే. ఐతరేయ బ్రాహ్మణము, అష్టమ పంచిక 4వ అధ్యాయము ప్రథమ ఖండములో 'సార్వభౌమ' నిర్వచనము కలదు. "ఏరాజ్యము అన్నిచోట్ల వ్యాపించి యున్నదో, దానిని 'సార్వభౌమ' యందురు; అనగా పృథివినుండి సముద్రపర్యంతము ఏది ఏక మాత్ర రాజ్యమగు చున్నదో, అది 'సార్వభౌమ' యనబడును.

ఈ బ్రాహ్మణములోనే సప్తమపంచిక 5వ అధ్యాయము 8వ ఖండ ములో 'సార్వభౌము' లైన 8మంది పేర్కొన బడిరి.

వారెవరన "1 కావేషయః తురః 2 సాహదేవ్యః సోమకః 3 సార్జయః సహదేవః 4 దైవావృథో బభ్రుః 5. వైదర్భో భీమః 6 గాంధారో నగ్నజిత్ 6 జానకిః క్రతువిత్ 8 పైజవనః సుదసః; ఇందు దశరథుని పేరు గాని రాముని పేరుగాని లేదు.

దశరథుడు సార్వభౌముడని, రామాయణమును బట్టి తేలుచున్నది. అయినచో పై బ్రాహ్మణ మేల వదలి యుండును? ఐతరేయ బ్రాహ్మణ అష్టమ పంచిక 3వ అధ్యాయము, తృతీయ ఖండములో అనేక ఆర్యరాజ్య

ముల వర్ణనము గలదు. 'గోపథ బ్రాహ్మణము'లో పూర్వభాగము, ద్వితీయ ప్రపాఠకము, తొమ్మిదిలోగూడ కొన్ని ఆర్య రాజ్యముల పేర్లు గలవు. ఈరెండు బ్రాహ్మణములబట్టి 'ఉత్తరకురు, ఉత్తరమద్ర, మత్స్య కురు, పాంచాల, వశ, ఉశీనర, ప్రాచ్య, భోజ్యపీచ్య, అపాచ్య, కోసల, విదేహ, కాశి, అంగ, మగధ, శవస, ఉదాచీ' అను దేశముల నార్యులెరింగియుండిరి; లేదా ఆర్యసభ్యత యిచ్చట వ్యాప్తిచెందియుండును.

రామాయణీయ శ్లోకములోని దక్షిణాపథము వంగ మాత్రములేవు. అంగదేశము జ్వరప్రధానదేశమని, మగధదేశము వ్యభిచార ప్రధానమైన 'అనార్యదేశము' లని, ఆర్యులు నమ్ముచుండిరి. మగధ, అంగసమీప ప్రాంతమునే ఆర్యులు 'కీకట' యనిపిల్చిరి. 'ఋగ్వేదము' లోగూడ 'కీకట దేశము' పేరు కాన్పించుచున్నది. బ్రాహ్మణములలో దక్షిణాపథము, వంగ పేర్కొనబడలేదు. బౌద్ధవాఙ్మయములో, షోడశమహాజన పదములలో గూడనివిలేవు. రామాయణములో దశరథుని క్రింద నివి రెండుకూడ ఉన్నట్లు కలదు.

దక్షిణాపథములో ఆర్యులెపుడు ప్రవేశించినది, ఈవరకే చారిత్రక ప్రమాణములతో వ్రాసియుంటిని. ఇపుడు వంగదేశమును గూర్చి విచారింప వలసియున్నది.

క్రీ. పూ. 5 లేక 6వ శతాబ్ద ప్రాంతపువాడగు, 'బోధాయనుడు' భరత వర్షమును మూడు భాగములుగా విభజించి, ఆర్యరక్త భేదమును దెలియ జేసెను. ఈతని వచనములబట్టి, గంగానది లోయలోని పరిశుద్ధ ఆర్యరక్తము గలవారు, అధికగౌరవమును బొందుచుండిరని, దక్షిణ, తూర్పు బీహారులు, దక్షిణ పంజాబు, సింధు, గుజరాతు, మాళవ, దక్కనులలోని, ఆర్యులు మిశ్ర రక్తము గలవారగుటచేత, కొంచెము తక్కువ గౌరవము గలవారని, వంగ, ఒరిస్సా, దక్షిణా పథములలో నార్యులు ప్రవేశింపక పోవుటచేత, ఆర్యరక్తము లేనందున, ఈ దేశముల పవిత్రములని, యిచటికి బోయినవారు యజ్ఞములు, ప్రాయశ్చిత్తములు చేయవలయునని తెలియవచ్చుచున్నది. బోధాయనుడు "ఎవరు ఆరాట్టులను (పంజాబు), కారస్కరులను (దక్షిణాపథము) పుండ్రులను (ఉత్తర వంగ) సౌవీరులను (దక్షిణపంజాబు) వంగదేశములను (తూర్పువంగ) కళింగులను (దక్షిణవంగ—ఒరిస్సా) లేక పాణానలను,

దక్షిణంతమునకో వారు యజ్ఞము చేయవలయును" అని వచించెను. దీనినిబట్టి క్రీ. పూ. 6వ శతాబ్దము నాటికి ఆర్యులు వంగ దేశములో గాలిడ లేదని తెలియవచ్చు చున్నది కదా!

క్రీస్తు పూర్వము 6వ శతాబ్దములోని మగధరాజు బింబిసారుడు అంగ, కోసల, కాశి, మగధ, దేశముల కధిపతియై యుండెను. ఆతని కుమారుడు 'అజాత శత్రుడు' ఉత్తర, పశ్చిమ దిశల వరకు రాజ్యము వ్యాప్తి చేసెను. కాశి, కోసల, విదేహరాజ్యము, లితని క్రింద కూడ కలవు. అజాత శత్రుని కూతురు 'పద్మావతి'ని ఉదయనుడు పెండ్లాడుట చేత బంగాళా ఖాతమునుండి రాజపుత్రస్థాన ఎడారి వరకు, నితని రాజ్యము విస్తరించి యుండెనని పురాణములే తెల్పుచున్నవి. ఉదయనుడు క్రీ. పూ. 5వ శతాబ్దిలోని వాడు.

ఎట్లయినను క్రీ. పూ. 4వ శతాబ్దినాటికి అంగ, వంగ, కళింగ రాజ్యములలో ఆర్యనాగరికత కలదని బెంగాలు, ఒరిస్సాలలో ఆర్యరాజ్యములు గలవని దృఢముగా చారిత్ర కాధారములబట్టి చెప్పవచ్చును. బుద్ధునికి బూర్వము ఆర్యులు వంగదేశమునకు రాలేదు; మిధిల, మగధలకు దూర్పున ఆర్యులరాక అనుమానాస్పదమే యగుచున్నది. 'ఉదయన రాజ్యము'లో వంగదేశమున్నను క్రీ. పూ. 5వ శతాబ్దికి బూర్వము కాజాలదు. దక్షిణాపథము వంగదేశము ఆర్యరాజగు దశరథుని వశములో నున్నవని రామాయణము తెల్పుట చేత, వంగదేశములో నార్యులు క్రీ. పూ. 5వ శతాబ్దికి బూర్వము ప్రవేశింపక పోవుటచేత దీనికి తర్వాతనే రామాయణ రచన జరిగియుండ వలయును. త్రేతాయుగాదులను బట్టి కాలనిర్ణయము చేయుట సాహసము, వెర్రితనము; ఏలనన యుగముల విభజనయే మిధ్య; ఆవిభజన చారిత్రక సత్యము కాజాలదు.

19. రాముడు బయలుదేరెనని 'వాల్మీకి' వర్ణించిన ప్రదేశము సరిగా ప్రస్తుత పాటలీపుత్ర ప్రాంతమే యగుచున్నది. ఈ పాటలీపుత్ర నిర్మాణమునకు ముందు, 'అజాతశత్రుడు' వజ్జియనులకు (లిచ్ఛవులు) భయపడి, శోణనది, గంగానది కలియుతావున, ఉత్తరపు తటము మీద, చిన్న కోటను గట్టెను. అజాతశత్రుడు, తర్వాతవచ్చినరాజు 'ఉదయనుడు' ఈకోటకు ప్రక్కనే 'కుసుమ పురము'ను (పాటలీ

పుత్రము) గట్టెను; రాజ్యాభిషిక్తుడైన నాల్గవ సంవత్సరములో, నీపురమును గట్టెనని, పురాణములు చెప్పుచున్నవి.

రామాయణ రచనా కాలమునాటికీ కోటకాని, నూత్న నగరముగాని యున్నచో, 'వాల్మీకి' దీని వర్ణనచేసి యుండెడివాడే. పాటలీ పుత్రము (కుసుమ పురము) పేరుకాని, నగరవర్ణనగాని లేని కారణమున, ఈ నగర నిర్మాణమునకు బూర్వమే మూలరామాయణ రచన జరుగుట స్పష్టము; అనగా క్రీ. పూ. 5వ శతాబ్దికి బూర్వమే మూలరామాయణ రచన జరిగి యుండవచ్చును.

20. బుద్ధుడు తన సూక్తములలో ననేకచోట్ల వేద, బ్రాహ్మణముల పేర్కొనెను కాని, యింత ఉత్తమ కావ్యమునుగాని, యిందలి పాత్రలను గూర్చి కాని తలంపలేదు; కాని అంతకుపూర్వపువగు 'శతపథబ్రాహ్మణ'ము, ఛాందోగ్యోపనిషత్తు, తైత్తిరీయారణ్యకము, అశ్వలాయన గృహ్య సూత్రము, మున్నగు వానిలో, 'ఇతిహాసపురాణం' అని అన్నిచోట్ల కాన్పించు చున్నది. ఇంకను ఈపదము మిలిందపన్హా ప్రథమ పరిచ్ఛేదములోను, అన్ని పురాణములు ఇతిహాసములలోను గాన్పించు చున్నది. దశరథజాతకములో నిట్లున్నది.

శ్లో॥ **దశవర్ష సహస్రాణి షష్టివర్ష శతానిచ**
**కంబు గ్రీవో, మహాబాహురామో రాజ్య మకారయత్.**

తా. కంబుగ్రీవము గల్గిన ఆ రాముడు 16 వేల ఏండ్లు రాజ్యము చేసెను. మొత్తము 554 జాతకకథలున్నవి. బార్హాటు, సాంచి, అమరావతి, లోని స్థూపములచుట్టు నున్న శిలలపై జాతక కథల సంబంధమగు బొమ్మలు లభించుటచేత, యివి క్రీ. పూ. 3 వశతాబ్ద ప్రాంతమున, అశోకునికి కొంచెము పూర్వమున వ్రాయబడినవని విద్వాంసుల యూహ. కాన జాతక కథలకు బూర్వమే రామాయణముండి యుండవచ్చును.

కాని దశరథ జాతకములోని కథకు మన రామాయణ కథకు కొన్ని ముఖ్య భేదములున్నవి. మెహతా పండితుడు వీనిని చక్కగా చర్చించెను. (చూ. ప్రాగ్బౌద్ధిక భారత వర్షము పుట–13–14–15)

1. దశరథ జాతకములో 'దశరథుడు' కాశీ ప్రభువని యున్నది. రామాయణములో అయోధ్య రాజని యున్నది.

2. దశరథునికి పెద్దభార్య వలన రామపండితు, లక్ష్మణకుమార, అను కుమారులు, సీతాదేవి అను కుమార్తె గల్గిరని యున్నది.

3. పెద్దభార్య చనిపోయిన తర్వాత దశరథు డింకొక వివాహము చేసికొనెనని, ఈమె వలన 'భరతకుమారుడు' కలిగెనని యున్నది.

4. అంతిపురములో కుట్రజరుగునని భయపడి దశరథుడు కుమారులను చేరువ రాజ్యమునకో అడవికో పంపెనని, వారిని తాను జీవించి యుండగా రావలదని చెప్పెనని, (12 ఏండ్ల) తరువాతవచ్చి రాజ్యము గైకొనుడని చెప్పెనని యున్నది.

5. రామలక్ష్మణులు, సోదరియగు సీతతో, దక్షిణమున దండకకుకాక, ఉత్తరమున 'హిమాలయములకు' వెళ్ళిరని యున్నది.

6. లక్ష్మణుడు, సీత 9 ఏండ్లతర్వాత కాశీకి వచ్చిరని, రాముడు మాత్రము అడవిలో నిండుకాలముండెనని యున్నది.

7. వనవాసము పూర్తియైనపిమ్మట, రాముడువచ్చి సీతనుపెండ్లాడి, సింహాసన మెక్కెనని యున్నది.

ఈ జాతక కథలు బయటపడినతర్వాత, రామాయణమున కిది మూలమా? యని పలువురు విద్వాంసు లాలోచింపసాగిరి. అందుచేత మూడువిషయము లుత్పన్నమైనవి.

1. దశరథ జాతకము ప్రాచీనమైనది; రామాయణమునకు మాతృకయైనది.

2. అది ప్రాచీనమైనదేకాని అది ఒక్కటే మూలముకాదు.

3. అది ప్రాచీనమైనదికాదు; రామాయణమునకు మూలముకాదు.

రామాయణమునకు మూలము జాతక కథలలో గలదని వాదించినవారు 'డి. ఆల్విస్, వీబరు, బర్నెల్' ముఖ్యులు. వీబరు రెండవ సిద్ధాంతమును ప్రబోధించెను. దీనిని 'సేన్, గ్రియర్సన్' పండితులు బలపరచిరి; కాని జాకోబి, లూడర్సు, కీత్, ఉట్టికర్, మున్నగువారు జాతక కథలు రామాయణమునకు జాల తర్వాత కాలములోనివని నిర్ధారణ చేయుటచేత, పై వాదనలు నిల్వలేదు. 'వింటర్‌నిట్జ్' మాత్రము క్రీ పూ. 3 లేక 4వ శతాబ్ద ప్రాంతములో త్రిపిటకము వ్యాప్తిలోనికి వచ్చునాటికి, రాముని కథ

మాత్రము గేయముల, పాటల రూపములోనుండి యున్నది; కాని రామాయణము లేదు. ఇది పైగేయముల ననుసరించి, వాల్మీకిచేత అల్లబడినది. ఇట్లు భిన్నభిన్నముగా విద్వాంసు లభిప్రాయపడుచున్నారు.

దశరథ జాతకములో గాక, రాముని ప్రస్తావన, 'జయద్దీశ జాతకము' లోను' 'వసంతార జాతకము' లోను గాన్పించుచున్నది.

రెండవటిదానిలో, రామునితల్లి తన కుమారుని కొరకు ముక్తి సంపాదించినదని, రాముడు దండకారణ్యములో లేడనియున్నది. వసంతార భార్య 'మద్ది' యిట్లు చెప్పినది "నేను వనవాసమేగినట్టి కీర్తి గడించినట్టి రాజకుమారుని భార్యను; రాముని సీతచూచినట్లు, నేను నా భర్తను జూచెదను." ఇచట రాముని భార్యయే సీత యని స్పష్టపడుచున్నది.

వీనినిబట్టి రామాయణము, జాతక కథలకంటె పూర్వగ్రంధమేయని తోచుచున్నది.

ఈ ప్రకారము క్రీ. పూ. 14 వ శతాబ్దిలో రామాయణ మారంభింపబడినది. 12000 శ్లోకములతో మూలరామాయణమును వాల్మీకి తయారు చేయవచ్చును. అది పురాణములు, భారతమువలె వాగ్రూపములో వచ్చియుండవచ్చును. లిపి, వ్రాతసామగ్రి వచ్చులోపుగా గాయకుల ప్రతిభతో గొంచెము మారియుండ వచ్చును. క్రీ పూ. 2 వ శతాబ్దమునుండి, క్రీ. శ. 3 వ శతాబ్దమువరకు రామాయణము వ్రాతలోనికి దిగుటచేత, లేఖకులు పండితులు, అనేక ప్రక్షిప్త శ్లోకములుచేర్చి, వర్తమాన రామాయణముగా దయారు జేసియుండ వచ్చును. క్రీ. పూ. 6 వ శతాబ్దములోని మరియొక వాల్మీకి, రామాయణమును సంస్కరించెనని, పర్గిటరు, పి. టి. శ్రీనివాసయ్యంగారు మున్నగుగల పండితులు వ్రాసిరి; కాని ఈ యూహ సత్యమనుటకు మా కాధారములు లభింపలేదు. ఎపుడు వ్రాసినను, అమృతభాండములో విషము కలిసినట్లు, మూలరామాయణములో జేరిన ప్రక్షిప్త కాండములు, శ్లోకముల చేత, కథాసందర్భము చెడిపోయి, అద్భుతమైన పురాణముగా మత గ్రంథముగా తయారైనది.

# ౮. గాథ చారిత్రకమా ?

రామాయణ కాలనిర్ణయము చేయగల్గితిమి. గాథ చారిత్రకమా? అను విషయము తెలిసి కొందము.

ఆర్యులు దక్కను లంకల ప్రవేశించిన తర్వాత రామకథ జరిగినదను కొందుమా, ఆర్యులు దక్షిణ హిందూస్థానమునకు దండకారణ్యము దాటి వచ్చిన కాలము, క్రీ. పూ. 6 లేక 7వ శతాబ్దమునకు బూర్వము కాజాలదు. ఈ కాలములో ఉత్తర హిందూస్థానములో రాజ్యమేలిన రాజులలో రాముడని కాని, దశరథుడని కాని యెవరును లేరు. ఆ కాలపు చరిత్రను దెలిసికొనుటకు బౌద్ధ, జైన గ్రంథము లాధారములు. త్రిపిటకములు, జాతక కథలు లేనిచో మనకా కాలపు చరిత్ర తెలిసియుండబోదు. షోడశ మహా జన పదములలో 'కోసల' రాజ్యము గలదు. అయోధ్య, శ్రావస్తి, సాకేత నగరములు వీనిలో గలవు. ఇచట రాజ్యము చేసిన వంశవృక్షములలో నెచటను రాముని పేరు లేదు.

సింహళదేశ చరిత్రలగు మహావంశ, దీపవంశములలో నెచటను సింహళ ద్వీపమునకు జేరిన రాజు 'విజయుడని' కలదు కాని ఇతరుల పేర్లు లేవు. 'రాజావళి' యను సింహళదేశ చరిత్రలో బుద్ధునికి బూర్వము 1600 సంవత్సరముల క్రితము లంకపై రాముడను రాజు దండెత్తెనని కలదు కాని, అది చారిత్రకముగా ప్రామాణిక గ్రంథము కాజాలదు. చరిత్ర కారు లెవ్వరు దీనినుండి ప్రమాణముల గైకొనరు; కాన రాముని దండయాత్ర మిథ్యయే యగుచున్నది.

సూర్యపుత్రులు, చంద్రపుత్రులు నిజముగా సూర్యచంద్రుల పుత్రులు కారు. సూర్యచంద్రులు వారి యిష్టదేవతలు; గంగాపుత్రులను కాశీలోగల బ్రాహ్మణులు, గంగను పూజించువారేకాని, గంగాదేవి పుత్రులు కారు. సూర్యవంశము అనగా సూర్యోపాసకులు; చంద్రవంశము అనగా చంద్రోపాసకులు; క్రీ. పూ. 2000 లో 'బాబిలోనియా' ఆర్యులకు సూర్యుడుపాసక దేవత; మితన్ని ఆర్యరాజగు 'దశరథుడు' ఆ కాలములో 'బాబిలోనియా'

నేలినవాడు; సూర్యవంశములో నొకడు. అట్లనే 'రామాయణము' లోని 'దశరథుడు', ఇష్టదేవత సూర్యుడు గాగల్గియుండెను; అని 'హోవెల్' వ్రాసెను.

'మైమితన్ని ఆర్యరాజు' దశరథుడు, క్రీ పూ. 14 వ శతాబ్దమున 'మెసపటోమియా' నేలెను. క్రీ. పూ. 1367 లో 'దశరథరాజు' మరణానంతరము, 'మితన్ని'లో నరాజకత్వముగల్గగా, తూర్పున అస్సీరియనులు, పడమట 'హిట్టయిట్లు' ముట్టడింపగా, ఈ సూర్యోపాసకులు, దక్షిణమునకు జేరి యటనుండి భారతభూమికి జేరిరని 'హోవెల్' వ్రాసెను. అదియునుగాక దేవాసుర సంగ్రామములు, బహుశః సూర్య పూజకులగు ఆర్యులకు, మితన్ని రాజులక్రింద ప్రజలగు 'అస్సీరియా' సెమైట్లకు జరిగిన యుద్ధములగూర్చియే యైయుండవలయునని, 'హోవెల్' అభిప్రాయపడెను.

ఈ వలసవచ్చిన యార్యులలో దశరథుని కుమారుడు కూడగలడా ? ఈ యార్యులు దక్షిణముగా వలస వచ్చిన విధమునే, వాల్మీకి భరతవర్షములో జరిగిన దానివలె వర్ణించియుండెనా, యను సందియము బాధించుచున్నది. బాబిలోనియా, భారతీయ రాజవంశముల బరిశీలింపగా, నీయూహ సరికానట్లు తేలినది. 'మితన్నిరాజు' దశరథుని కుమారుడు, 'మటిఓజా' రాజభవనములోని కావలిగాండ్ర సహాయమున, జనకు నేచంపెను. 'శుతర్న' అనువాడు, 'హర్రి, మితన్నలకు రాజాయెను; అస్సీరియా రాజు దండెత్తి, 'మితన్ని' రాజభవనమును నాశనము జేసి, ధనమంతయు దోచుకొనెను. 'మటిఓజా' ఖాటిగాజైన 'శుబ్బిలేమా' చెంతకరిగి, సహాయ మర్థించెను. వారిరువురికి జరిగిన సంధి ఏర్పాటునుగూర్చి, తెలుపు రాతిఫలక, కప్పడోసియాలోని 'బొఘాజ్ కాయ్' లో దొరకినది. దానిమీద ఉభయుల సంతకములు కాన్పించుచున్నవి.

క్రీ. పూ. 1380 లోనిది జరిగినట్లు శార్మణ్య విద్వాంసులు నిర్ణయించిరి. ఈ యరాజకస్థితిలోనే సూర్యోపాసకులగు 'మితన్ని' ఆర్యులు భారత వర్షమునకు వేంచేసిరి. వీరే సూర్యవంశీకులు; ఆర్యావర్తములోనేయుండి, చాల కాలమునకుగాని, దక్షిణాపథమునకు రాలేదు.

రామాయణము, పురాణములబట్టి రాముని కాలనిర్ణయము జేయుచో క్రీస్తుపూర్వము 14 వ శతాబ్ద ప్రాంతమగుచున్నది. 'నిమి'కి; విదేహుడను

పేరు గలదు. ఆతని కుమారుడు 'జనకనిమి'; ఈయన పేరుతో విదేహ రాజులకు జనకులని పేరువచ్చినది. ఈతని కుమారుడు 'మిథి'; ఈతనిబట్టి ఈ రాజ్యమునకు 'మిథిల' యను పేరువచ్చినది. ఈ రాజే మిథిలాపురమును గట్టించెను. ఈ రాజులలో 26 వ వాడు 'శీరధ్వజ జనకుడు; సీత తండ్రి; శీరధ్వజుని సోదరుడగు 'కుశధ్వజుడు తన కుమార్తెను లక్ష్మణున కిచ్చెను. ఈ రాజవంశములో 57వ వాడు ఉగ్రసేన జనకుడు - ఈయన కాలములోనే వందిచేత నోడింపబడిన 'కాహోదకౌషీతకీ' నదిలో ముంచ బడెను; శ్వేతకేతువు, అష్టావక్రుడువచ్చి, వందినోడించి, తిరిగి వందిని నదిలో ముంచివైచిరి. 58వ వాడు 'జనక జానదేవుడు; ఈయనకే' పంచ శిఖుడను కాపిలేయుడు' సాంఖ్యము నేర్పెను. 59వ వాడగు 'జనకధర్మ ధ్వజుని'కి 'సులభి' యను 'కపిలుని' శిష్యురాలు 'సాంఖ్యము నేర్పెను.

'భారత యుద్ధకాల నిర్ణయము'నుబట్టి, ఉగ్రసేన జనకుని కాలము క్రీ. పూ. 850 అగుచున్నది. అచటనుండి 'శీరధ్వజ జనకుని'వరకు, (సీత తండ్రి) 32 తరములగును. అందుచేత 32×16=512 ఏండ్లు అగును. 850+ 512=1362, కాన క్రీ. పూ. 1362 వ సంవత్సర ప్రాంతమున జనకుడు న్నచో, నతని అల్లుడైన 'రామచంద్రుడు' కూడనాకాలమున నుండును గదా! క్రీ. పూ. 14వ శతాబ్దమునాటికి ఆర్యులు శాఖలు శాఖలుగా, భారతవర్షమునకు జేరుచుండిరేకాని, దక్షిణదేశమునకు జేరిన యాధారములు లభింపవు. మనుజుడు చొరలేని దండకారణ్యము ఛేదింపబడలేదు. దక్షిణా పథమున కింకను రాకపోక లేర్పడలేదు; కాన రామాయణగాథ పూర్తిగా సత్యము కాజాలదు.

రామాయణములోని పూర్వభాగము లేక మొదటి అంశము చారిత్రకమే యైనను రెండవ అంశము అనగా రాముడు దక్షిణా పథమునకు బోయి రావణుని జంపుట మున్నగునవి చారిత్రక సత్యములు కాజాలవు. రాము డను పేరుగలరాజు రామాయణ పురాణాదులలో నున్నను, ఆయన భార్య 'సీతను' రావణుడు కైకొని పోయి యుండలేదు'

ఈ ప్రకారము రామకథ హుళక్కి యగుచున్నది. మహావంశములో రాముడను శాక్యరాజకుమారుడుకలడు. ఆయనసింహళములో 'రామగోణ' యను గ్రామమున నివసించెనని మహావంశము తెల్పును. ఈ రామునికి

మన రాముని కేట్టి సంబంధములేదు. రామ దశరథుల బ్రాహ్మణభక్తిని రామాయణము సూచించు చున్నది. రాముడు అపరిమిత ధనధాన్యములు కోట్లకొలది గోదానములు బ్రాహ్మణులకు జేసెను. (బాలకాండ 5–94–95) దశరథుడు బ్రాహ్మణులకు పదిలక్షల గోవుల నిచ్చెను. పదికోట్ల బంగారు నాణెములు, నలుబదికోట్ల వెండినాణెము లిచ్చెను. ప్రసర్పక దేశజనులిచ్చిన కోటి బంగారు వరహాలు, బ్రాహ్మణులకిచ్చెను; దరిద్రుడగు ఒక బ్రాహ్మణునికి వస్త్రాభరణముల నిచ్చెను. దశరథుడు బంగారు మయమైన కొమ్ములుగల ఆవులను నాల్గులక్షలు దానము చేసెను. రాముడొక బ్రాహ్మణుని కొకరాయి విసరుమనిచెప్పి, అంత దూరము వరకు గల ఆవులను, ధర్మము చేసెను. రాముడు చివరకు లక్ష గుఱ్ఱములు, అప్పుడే ఈనిన లక్ష గోవులు, 100 ఎడ్లు, హిరణ్య దానము బ్రాహ్మణులకు జేసెను. (యుద్ధకాండ 131-69-25) రాముడనేక అశ్వమేధయాగములు చేసెను. క్షత్రియుడు సాష్టాంగ నమస్కారముచేసి, బ్రాహ్మణుని ద్వారా రామాయణము వినవలయుననుట, శూద్రులు పైమూడు జాతులవారికి ఉపచారములుచేసి, వారికుల ధర్మములలో నాసక్తి గల్గియుండిరనుట, 'ఇత్యాది విషయములనుబట్టిచూడగా, బ్రహ్మవేత్తలైన బ్రాహ్మణులయందు ప్రజలకు హెచ్చుభక్తి శ్రద్ధలు గలకాలమందే రామాయణ రచన జరిగి యుండవచ్చునని తోచుచున్నది. అశోకమహారాజు కాలమందు ప్రజలకు బ్రాహ్మణ, శ్రమణులయందు హెచ్చుగా భక్తి శ్రద్ధలుగలవనుట కాధారములుగలవు. క్రీ. పూ. 300 ప్రాంతమున, బ్రాహ్మణులదే పైచేయియని, వారు ముఖ్యులని, వారితర్వాత శ్రమణుల కాధిక్యతకలదని, యవనుల వ్రాతలవలన నెరుంగవచ్చును.

మెగస్థనీసు వ్రాతల భద్రపరచిన స్ట్రాబో. డయోడోరసులు వ్రాసిన ప్రకారము, క్రీ. పూ. 300 ప్రాంతమున నవతార పురుషుల పూజ చేయు పద్ధతి, భారతభూమిలో గలదని తెలుచున్నది. ఈయవతార కథనము రామాయణములోనే యున్నది. ఇట్లు ప్రజలలో భక్తిభావము వృద్ధికలుగుటకు అవతారాదులగల్పించి, మూలరామాయణములో ననేక ప్రక్షిప్తభాగములు చేర్చి, వర్తమాన రామాయణమును బూర్తిచేసిరి.

సుందర కాండము (28–5)లో 'బ్రాహ్మణుడు శూద్రుని కెట్లుపదేశము చేయరాదో, అట్లనే నాదేహమును రావణునికి స్వాధీనము చేయుటతగదు ?

అని సీత చెప్పినట్లున్నది. దీనినిబట్టి శూద్రులకు మంత్రోపదేశము చేసిన, దుర్వినియోగపరచెదరనే భయము హెచ్చుగానున్నట్లు కాన్పించుచున్నది. బ్రహ్మ విద్యోపదేశముచేసిన, భార్యలు తమ్ము వీడిపోయెదరేమోఅను భయము భర్తలకు గలదని మెగస్తనీసు వ్రాసెను. అట్లనే శూద్రులకు మంత్రోపదేశముచేసిన, పరిచర్య చేయరనే భయముకూడ ఉండవచ్చును. ఆకాలములో సాంఘికముగా జూచిన స్త్రీ, శూద్ర, హరిజనులకొకే స్థానము గలదని చెప్పవచ్చును. ఉత్తరకాండమే ప్రక్షిప్తమని వ్రాసినపుడు, అందలి 'శంబుకవధ' మున్నగు కథలన్ని కల్పితములగుట నిజము. ఈకథ సత్యమైనచో రామరాజ్యములో పంచమకు సరిసమానావకాశములు లేవని స్పష్టపడుచున్నది.

రామాయణములోని రావణుడెవరు? వంశవృక్షములలో రావణుడు గలడు. శివపురాణాదులబట్టి చూడగా, రావణుని కథ తెలియును. మాయకు ఇరువురు కూతుండ్రుగలరు. 1 మాయావతి, 2 మండోదరి; శంబరునికి మాయావతిని, రావణునికి మండోదరి నిచ్చి వివాహము చేసిరి. ఈ రావణుడు 'వేదావతి అంగీరసి'ని, ఇంక యితర బాలికల చెరపట్టెను. ఒకసారి శంబరుని భార్య మాయావతినికూడ చెరపట్ట ప్రయత్నింప, శంబరుని రాజధానిలో నతని సైనికులు, రావణుని, అతని మిత్రులగు 'ప్రహస్తా'దుల బట్టుకొనగా, శంబరుని మామయైన 'మాయ' కోర్కెపైన విడుదలచేసిరి. దీనినిబట్టి, దశరథుడు, దివోదాసుడు, శంబర, రావణులు సమకాలీనులని తెలియుచున్నది.

వేదఋషి 'తృణబిందు'నకు 'విశాల'యను కుమారుడు కలిగెను; ఈతడే 'వైశాలి' నగరమును గట్టించెను. 'తృణబిందు' కూతురు 'ద్రవిర' లేక ఇలాలిల. ఈ ద్రవిరను 'పులస్త్యు'కు జేసిరి, ఈతనికి దక్షిణమున కొండలపైన కోటలుగలవు. 'ద్రవిర'కు 'విశ్రావసు' ఇలాలిల అను కుమారుడుకల్గెను. 'విశ్రావసు'డు 'దేవవర్ణని' అను అంగీరస బృహస్పతి శాఖకు చెందిన బాలికను వివాహమాడి, నర్మదానది ఒడ్డున నివసించెను. వీరికుమారుడు 'వైశ్రావణ కుబేరుడు'. ఈతడు పాలించిన ప్రజలను 'యక్షు'లందురు. ఈతనికి 1 నలకుబేర 2 రావణ 3 కుంభకర్ణ 4 విభీషణయను నలుగురు కుమారులును, 'శూర్పణఖ'యను కుమార్తెయును గల్గెను. శివపురాణాదులను

బట్టి, రావణుడు శివభక్తుడేమోయని తోచుచున్నది; కాని పరస్త్రీలను ఏకారణమునమో చెరపట్టుచున్నట్లు తెలిసికొన వచ్చును. ఈ గుణమును బట్టియే, సీతను దొంగిలించుకొని పోయినాడని ఆరోపణచేయుట కవకాశము చిక్కినది. ఈతడు ఏలిన దక్షిణరాజ్య మెద్దియో, ఈతని కోటలేవియో తెలియకున్నవి. విజయుని రాకకు పూర్వము 'లంక'లో యక్షులున్నట్లు 'మహావంశము' తెల్పుచున్నది. అట్లయిన ఆర్యవంశములోని వాలికను బెండ్లాడిన 'వైశ్రావణకుబేరుడు' పాలించిన యక్షులెవరు ? లంకలోని యక్షులా ? లేక మరియొకచోటనున్న యక్షులా ? వీరేరైనచో కుబేరుడు నర్మదనుండి లంక కెట్లు చేరెను ? ఏ మార్గమున బోయెను ? ఎట్లురాజాయెను? ఈ విషయములకు సమాధానములే లేవు. రామాయణములోనియోజన పరిమాణములను బట్టియే ఆలంక కాదేమోయని తోచుచున్నది. బహుశః రావణుడేలిన లంక నర్మదనదికో, బొంబాయి సముద్రప్రాంతమునకో చేరువ నుండెనేమో !

రామాయణమున వర్ణింప బడిన 'రాక్షసులు' అనార్యులగుటనిశ్చయము. వాల్మీకి వారిని కోతులు, ఎలుగుబంట్లుగాను, లంకలోని రాక్షసులుగా వర్ణించెనని దత్తువ్రాసెను. మనుజులను బోలిన వానరములు అలెగ్జాండరు కాలమున నున్నట్లు తెలియవచ్చు చున్నది. ఒక పర్యాయము, మర్కటముల మూకయొకటి ఒక అరణ్యమునుండి బయటకు వచ్చెనని 'మాసిడోనియా సైనికులు' కెదురునిల్చెనని ఆ వానరములు సైనిక దుస్తులలో నుండుటగాంచి నిజమైన సైన్యమని గ్రీకుసైనికులు భయపడి శత్రువులుగా భావించి ఎదుర్కొనుటకు సిద్ధపడినట్లు తెలియు చున్నది.[55]

ఈవిషయము 'క్లైటార్కసు' అను గ్రీకు లేఖకుడు కూడ వర్ణించెను. వానరులు నాగరిక జాతియని కొందరు వర్ణించిరి. కన్నడములోని 'పంపారామాయణము'లో వానరులు అనగా కోతులు కారని, కపిధ్వజము గల్గిన

55. M. M. williams—Indian wisdom – P 3?8 Strabo (XV—29) relates that on a particular occasion a large number of Monkeys came out of a wood and stood opposite the Macedonian troops, who seeing them apparently stationed in military array, mistook them for a real army and prepared to attack them as enemies Cambridge History of India, Vol I—P. 399

జనులని హనుమంతుడు 'హనువర ద్వీపమునకు' అధిపతియని వ్రాయబడి యున్నది.

ఏవిధముగా నాలోచించినను రాముడు దక్షిణా పథమునకు వచ్చిన ఆధారములు లభింపవు. రాముని కాలమున వాల్మీకి, జమదగ్ని, భరద్వాజుడు, గౌతముడు, శరభంగుడు, మున్నగు ఋషుల ఆశ్రమములుండవచ్చును. రాముడు, లక్ష్మణుడు, రావణాదులుకూడ నుండవచ్చును; కాని రావణుని రాజ్యము లంకలోనని కాని, రాముడు లంకపై దండెత్తెనని కాని, ఋజువు చేయుటకు వలయు ప్రమాణములు లభింపవు. విమానములపై యుద్ధము జరిగనని కాని, ఆకాలపు భారతీయులకు విమానములు చేయుపద్ధతులు తెలియునని కాని ఋజువుపర్చలేము; ఇవి అలంకారిక వర్ణనలగుట తథ్యము.

'భోజదేవ' కృతమగు 'సమరాంగణ సూత్రధారము' అను 83 అధ్యాయముల గ్రంథములో, యంత్ర శిల్పమునుగూర్చి 2 అధ్యాయములలో గలదని, 'గజయంత్రము' 'వ్యోమచారివిహంగ విమానయంత్రము' 'ఆకాశగామిదారుమయ విమానయంత్రము' మున్నగు వానినిగూర్చి కలదని, 'మాడరన్ రివ్యూ' మున్నగు పత్రికలలో వ్రాసినారు. "తేలికైన చెక్కలతో పక్షిరూపముగా విమానమును నిర్మించి, దానిరెక్కలు, తోక మున్నగునవి దృఢబద్ధములొనర్చి, మధ్య ప్రదేశమున రసయంత్రము నేర్పరచి, రసయంత్రము దిగువ నగ్నిని ప్రజ్వలింపజేసి, మనుష్యుడందు కూర్చుని నడిపిన, రెక్కలచలనము వలన కలిగిన గాలిచేత, లోపలనున్న పారదయంత్రముయొక్క శక్తి చేత, మనుజుడు ఎంతదూరమైన పయనముచేయగలడు" ఇది వ్యోమచారి విహంగ విమానయంత్రము. ఇట్లనే ఆకాశగామి దారుమయ విమానయంత్రము కూడ కలదు. కాని యివి ఒక కాలమున చేయబడెనని కాని, ఈపరిశ్రమ ఒకప్పుడు వృద్ధిలోనున్నదని కాని క్షీణించినదని కాని రాజులిందు విహరించినారని కాని పెట్రోలు విమానాశ్రయములు కలవని కాని, చారిత్రకాధారములు మాకు లభింపవు. కనుకయివియన్ని ఊహలే కాని, చారిత్రకసత్యములు కానందున పుష్పకాది విమానములపై రాముని సంచారము హుళక్కియే. ఈ ప్రకారామకథ అత్యధికభాగము చారిత్రకము కాజాలదు.

# ౯. రామాయణము ననుసరించిన వాఙ్మయము

రామకథలోని కొలదిభాగము మాత్రము చారిత్రాత్మకమని, మిగత భాగము వేదములోని ఇంద్రవృత్రాసురయుద్ధమునే, వాల్మీకి యిట్లు వర్ణించె నని తెలిసికొంటిమి; కాని రామాయణమంత సత్యమని నమ్మి, అనేకమంది విద్వాంసులు తమకు తోచినట్లు రామకథను రచించిరి. 'విలియమ్సు' 'సంపత్కుమార' మున్నగువారు వీనినన్నిటి నొకచోట పేర్కొనిరి.[56]

రామచరిత్ర మహాభారతము వనపర్వములోనున్నది. ఇంకను కొన్ని భాగములు, ద్రోణపర్వము, శాంతిపర్వము, హరివంశములో గాన్పించు చున్నవి. 'మృచ్ఛకటికము' లోను కాళిదాసు రచిత రఘువంశములోను రామకథ కాన్పించును; మేఘదూతలో దీనికి సంబంధించి రెండు శ్లోకములు కలవు. 'సేతుబంధ'లోను, భట్టికావ్యములోను గలదు. భట్టి 'రావణ వధ'ను రచించెను. 22 సర్గలు గల ఈ భట్టికావ్యము, క్రీ. శ. 530_545 మధ్య, 'వాలాభిపురము'లో శ్రీధరసేనుని కాలమున వ్రాయబడెనని, లాసేను పండితుడు వ్రాసెను. ఈ పురము క్రీ. శ. 523 లో నాశనమాయెను. భావనగర సమీపమున ఈనగర శిధిలములు కాన్పించును. క్రీ. శ. 695_733 మధ్యలోనున్న భవభూతిరచిత మహావీర చరిత్ర, ఉత్తరరామచరిత్రలలో గూడ నిది కలదు. ఉత్తర రామచరిత్రలో, వాల్మీకిరామాయణములోని శ్లోకములు, రెండవ అంకములో నొకటి, ఆరవ అంకములో రెండు కలవు. భవభూతి యొక్క ఈ రెండు నాటకములు కాక, హనుమన్నాటకము లేక మహానాటకము,' 14 అంకములలో గలదు. ఇది హనుమంతుని చేతనే రచింప బడినదని, ఈతడు మొదట కొండరాళ్ళపై రచించెనని, వాల్మీకిని దృష్టి కరుటకు సముద్రములో బడవైచెనని, అందుండి భోజుని కాలమున కొన్ని భాగములు సంపాదించి, 10 వ శతాబ్దప్రాంతములో 'మిశ్రదామోదరుడు' దీనిని బయటపడవేసెనని చెప్పుదురు. 'మురారి' రచిత అనర్ఘరాఘవము అంకముల గ్రంథము కలదు. ఇది 'భవభూతి రచిత మహావీరచరిత్ర నను సరించినది. జయదేవ రచిత ప్రసన్నరాఘవము. 7 అంకములు గల

---

56. M. M. Williams - Indian wisdom P 366, 367, 368, Also M. R. Sampath kumar - Sri Rama P 73—82

సుందర 'మిశ్ర' రచితమగు 'అభిరామమణి', ఐదుఅంకములలో విదర్భ రాజు భోజరచితమగు చంపూరామాయణము, రాజశేఖర రచితములగు 'రాఘవాభ్యుదయము, బాలరామాయణము, ఉదాత్తరాఘవము, చలిత రామ, ఇంకను 'సుభత' రచితమగు 'దూతనగాద' కలవు. భాసుని రెండు నాటకములలో 1 అభిషేక నాటకము 2 ప్రతిమానాటకములో రామకథ కాన్పించును.

క్రీ. శ. 505–587 మధ్యలోని వరాహమిహిరుడు, రామాయణమును జూచెను. ఈతని కాలమునాటికి రాముని దేవునిగా నారాధించు చుండిరి. ఏలనన 'బృహత్కథలో ఈతడు రాముని విగ్రహములగూర్చి ప్రస్తావించెను. క్రీ.శ.598 లో వాలాభిలో శిలాదిత్యరాజు కాలమునవ్రాయబడిన, 'శత్రుంజయమహాత్మ్యములో రామకథ పేరుగలదు. క్రీ. శ. 7 వ శతాబ్దములోని సుబంధుని వాసవదత్తలో సుందరకాండము రామాయణములోని భాగమని ఉన్నది. బాణుని కాదంబరిలో, బలుచోట్ల రామకథ పేర్కొన బడినది. హాలుని సప్తశతకము, రాజశేఖరుని 'ప్రచండ పాండవము' ధనంజయుని 'దశరూప', గోవర్ధనుని 'సప్తసతి' త్రివిక్రమ భట్టుయొక్క 'దమయంతికథ' రాజతరంగిణి, 'సారంగధర పద్ధతి' మున్నగు గ్రంథకర్తలు రామాయణము నెరుంగుదురు; 'కుమారదాసుని' జానకీహరణము ( క్రీ. శ. 6_8 శ. మధ్యములోనిది ) లో రామకథ వర్ణింప బడినది. పదునెనిమిది పురాణములలో రామకథ పేర్కొనబడినది. అగ్ని, పద్మ, స్కాంద, విష్ణు, బ్రహ్మాండ వాయు కూర్మ మున్నగు పురాణములలో రామకథ గలదు. కాళిదాసుని రఘువంశమునకు బీజము పద్మ పురాణమై యున్నది. అధ్యాత్మరామాయణము కూడ గలదు. దీనిలోనే రామహృదయము, రామగీత కాన్పించును. వశిష్ఠరామాయణమను మరి యొక గ్రంథము కలదు. ఇది క్రీ. శ. 5 లేక 6వ శతాబ్దములోనిది కావచ్చును. కవిరాజ రచితరాఘవ పాండవీయము ద్వ్యర్థికావ్యము; క్రీ. శ. 8వ శతాబ్ది నాటిది. విశ్వనాథ రచిత 'రాఘవవిలాసము' రామచరణ రచిత 'రామవిలాసము' హరినాథరచిత 'రామవిలాసము, అగ్నివేశ రచిత 'రామచంద్ర చరిత సారము, రఘునాథాభ్యుదయము మున్నగునవి రామాయణ కథలే. ఈ ప్రకార మనేక భారతీయభాషలలో రామకథ కాన్పించు చున్నది.

'పాణిని' కూడ ఒక రామాఖ్యాన మెరుంగునని కొందరు వ్రాసిరి. బౌద్ధుల దశరథ జాతకములో రామకథ కలదు కాని రావణునిపై దండయాత్ర కాన్పింపదు; జైనులు కూడ, 63 సలక పురుషుల వర్ణనలో రామలక్ష్మణుల గూర్చి వర్ణించిరి. ఈ 63లో 24గురు తీర్థంకరులు, 12గురు చక్రవర్తినులు, 9మంది వాసుదేవులు, 9 మంది బలదేవులు, 9మంది విష్ణుద్వేషులు లేక ప్రతివాసు దేవులుం గలరు. రామలక్ష్మణులిందు, 8వ బలదేవవాసుదేవులుగా నున్నారు. రామలక్ష్మణులు 20 వ తీర్థంకరుడగు 'మునిసువ్రత' కాలములోనివారని తెలియుచున్నది. 'రవిసేనాచార్య' రచిత 'పద్మపురాణము'లో జైనరచితమగు మొదటిరామాయణము కాన్పించుచున్నది. పారంపర్యముగవచ్చు గాధలను బట్టిచూడగా, 'గణగ్రాని' అయిన గౌతముడు, 'వీరవర్ధమానుని' దగ్గర రామకథను నేర్చెనని, 'విపులపర్వతము'పైన 'మగధరాజునకు' వినిపించెనని తెలియుచున్నది. జైనుల రామకథకు, వాల్మీకి రామాయణమునకు చాల భేదములున్నవి. [57] 'పౌరచరియము' అను రామచరిత్ర, క్రీ. శ. 3 వ శతాబ్దములో జైన మహారాష్ట్రీ ప్రాకృతభాషలో 'విమలకవి'చే వ్రాయబడినది.

అశ్వఘోషుడు కూడ తన బుద్ధచరిత్ర వ్రాయుచు రామాయణమును జూచి యుండవచ్చునని 'కీత్' మున్నగు విద్వాంసులు వ్రాసిరి; ఏలనన రామాయణ ప్రభావము 'బుద్ధచరిత్ర' లో గాన్పించును. నాల్గు ఉపనిషత్తులలో రామపూజ కాన్పించును. రెండవశతాబ్దములోని 'నాసిక శిలా శాసనములో రామతీర్థమను తీర్థము పేర్కొనబడినది; కాని ఏరాముడో తెలియదు. కులశేఖరాళ్వారులు 'పరకలమువారు' కూడ తమిళవాఙ్మయములో రామునిగూర్చి పాడియుండిరి. మధ్యకాలములోని, శక్తిభద్రుని ఆశ్చర్య చూడామణి, రామభద్రదీక్షితుని జానకీపరిణయము, వేదాంత దేశికుల 'హంససందేశము, మున్నగునవిముఖ్యములు; ఇవియన్నియు రామకథకు సంబంధించినవి. దక్షిణదేశములో 'కంబరామాయణము' ప్రసిద్ధిగాంచినది. కన్నడ వాఙ్మయములో 'అభినవపంప' యనువాడు 'రామచంద్ర చరిత్రపురాణము' అను రామాయణమును రచించెను; ఇది జైనుల రామాయణము ననుసరించి వ్రాయబడినగ్రంథము. కన్నడములో 'వాల్మీకి రామాయణము, ననుసరించిన వాడు, 'కుమార వాల్మీకి' యను పేర విఖ్యాతుడై యుండెను. మళయాళ

57 M. R. Sampath Kumar M. A. Sri Rama P 68–69

ప్రాచీనమైనను 'రామచరిత్ర' కలదు. తెలుగు సారస్వతములోగూడ, రామచరిత్రము, రంగనాథ రామాయణములో మొట్టమొదటగా గాన్పించుచున్నది; తర్వాత 'రామకథ' అనేక కావ్యములలో వర్ణింపబడినది. 'తులసీదాసు రామాయణము' ఉత్తర దేశములో ప్రఖ్యాతిగాంచినది; 'చింతామణి త్రిపది, ఈశ్వరీ ప్రసాదు' అను 17వ శతాబ్దములోని కవులు, హిందీలో నితర రామాయణముల రచించిరి. 15వ శతాబ్దములో 'కృత్తివాస ఓఝు' వంగభాషలోను, ఆ కాలముననే 'అనంత కందలి' అస్సామీయ భాషలోను రామాయణమును రచించిరి. 'ప్రేమానందుడు' గుజరాతీ భాషలో 17వ శతాబ్దములో రామాయణము రచించెను. ఈ విషయములు 'సంపత్కుమార' అను విద్వాంసుడు వ్రాసెను. ఇట్లన్ని భాషలలోను 'రామకథ' ప్రతికలతోను భాష్యములతోసహా కాన్పించును. రామకథ వ్రాయడమే పుణ్యమని ప్రతివారు భావింపసాగిరి. ప్రతివారు ముందువానివెంట ప్రయాణముచేయు గ్రుడ్డివానివలె, సంచరించిరే కాని, రామకథ సత్యమా? ఎంతవరకు సత్యము? అని చారిత్రకముగా యోచించినవారు లేరు. బుద్ధభగవానుని ఈ సూక్తి రత్నమును జదువుకొని, వివేచనాశక్తిని వృద్ధి జేసికొనుడు. "ఏవో ప్రాచీనములగు వ్రాత ప్రతులలో నున్నంతమాత్రమున, ఏ విషయమును సత్యమని నమ్మకుడు. సాంప్రదాయికముగా వచ్చుచున్నదని తలంచి, సత్యమని నమ్మకుడు; దేశాచారము కదాయని, వాస్తవమైనదని తలంచి నమ్మకుడు; పెద్దలు, మిత్రుల వాక్యమునుండి నమ్మించుచున్నారని సత్యమని నమ్మకుడు; చక్కగా కార్యకారణ సంబంధములను బరామర్శించి, సంపూర్ణముగా విమర్శించినపిమ్మట, అయ్యది సమస్త మానవ శ్రేయస్కరమని మీకుతోచిన పక్షమున, నమ్ముడు; నమ్మి దాని ననుసరించి ప్రవర్తింపుడు; ఇతరుల నట్లు ప్రవర్తించుటకై తోడ్పడవలసినది." (అంగుత్తరనికాయము—కలామ సూక్తము.) ఈ ప్రకారము యోచించిన ప్రతికథ ఎంతవరకు సత్యమో బోధపడును; ప్రక్షిప్తభాగములను దొలగించి సత్యమగు చారిత్రాంశముల గ్రహింప శక్తిగలవారై దేశకల్యాణమునకు దోడ్పడిన వారగుదురు; లేనిచో తామే కాక, నోరులేని కోటానుకోట్ల అమాయక ప్రజలనుగూడ అంధకార కూపములో బడవేసి, లౌకిక ప్రజాస్వామిక రాజ్యమును వ్యర్థము చేసిన వారగుచున్నారు.